# ముఖ బంధిత మధు కలశం

## (అర్రహీఖుల్ మఖ్తూమ్ సంక్షిప్తీకరణ)

مختصر الرحيق المختوم

మూలం

మౌలానా సఫీవుర్రహ్మాన్ ముబారక్‌పూరీ

تلغـو

IPC

لجنة التعريف بالإسلام

ISLAM PRESENTATION COMMITTEE

جمعية النجاة الخيرية

# ముఖ బంధిత మధు కలశం

## (అర్రహీఖుల్ మఖ్తూమ్ సంక్షిప్తీకరణ)

మూలం

**మౌలానా సఫీవుర్రహ్మాన్ ముబారక్‌పూరీ**

తెలుగు రూపం

**సయ్యిద్ అబ్దుస్సలామ్ ఉమ్రీ**

ప్రకాశకులు

**ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ**

# విషయ సూచిక

# ఆశీర్వచనం

**వి**శ్వ విఖ్యాత “అర్రహీఖుల్ మఖ్తూమ్” సీరత్ గ్రంథ రచయిత, ప్రముఖ ఇస్లామీయ పరిశోధకులు మౌలానా సఫీవుర్రహ్మాన్ ముబారక్‌పూరీ గారి ఇస్లామీయ సాహితీ సేవలను ముస్లిం జగతి మరువజాలదు. 20వ శతాబ్దిలో భారత ఉపఖండంలో జన్మించిన ఉన్నత శ్రేణికి చెందిన విద్వాంసులలో మౌలానా సఫీవుర్రహ్మాన్ ఒకరు. ఉత్తర ప్రదేశ్‌లోని ఆజంగఢ్ జిల్లాకు చెందిన ముబారక్‌పూర్ పట్టణ శివార్లలో ఉన్న హుసైనాబాద్‌లో ఈయన 1942లో జన్మించారు. మౌలానాది పండితుల కుటుంబం. బాల్యం నుండే ధార్మిక శిక్షణలో పెరిగి పెద్దవారయ్యారు. తాను చదివిన ప్రతి విద్యాపీఠంలోను ఉన్నత శ్రేణిలోనే ఉత్తీర్ణులయ్యారు. అనేక విద్యా సంస్థలలో అధ్యాపకునిగా సేవలందించారు. 1974లో జామియా సలఫియా (బనారస్)లో అధ్యాపకునిగా జాయిన్ అయ్యారు. యుక్త వయసు నుంచే అరబీ, ఉర్దూలలో రచనా ప్రక్రియను మొదలెట్టిన ఈయన 50కి పైగా పుస్తకాలను రచించారు. అయితే రాబితా ఆలమె ఇస్లామీ (MUSLIM WORLD LEAGUE - MAKKA) వారి పిలుపుపై మహా ప్రవక్త ముహమ్మద్ (ﷺ) జీవిత చరిత్రకు సంబంధించి ఈయన అరబీలో చేసిన రచన **‘అర్రహీఖుల్ మఖ్తూమ్’**కు ఉత్తమ రచన అవార్డు లభించింది. ఈ విధంగా దేశదేశాల నుంచి అనేక మంది విద్వాంసులు సీరత్‌పై రచనలు పంపగా ఒక భారత పండితునికి అవార్డు లభించటం నిజంగా భారతీయులకు గర్వకారణమే.

మౌలానా సఫీవుర్రహ్మాన్ పాండితీ ప్రకర్షను గుర్తించిన మదీనా ఇస్లామీయ విశ్వ విద్యాలయంవారు ఆయన సేవల్ని ఇస్లామీయ పరిశోధనా విభాగంలో పొందేందుకు పిలుచుకున్నారు. 14 సంవత్సరాల పాటు ఈయన జామియా (మదీనా)లో తన సేవ లందించి, భారత్‌కు తిరిగి వచ్చారు. అనంతరం అఖిల భారత జమీయతె అహ్లె హదీస్‌కు అమీర్‌గా ఎన్నికయ్యారు. తర్వాత రియాద్ (సవూదీ అరేబియా)లోని ప్రఖ్యాత ఇస్లామీయ ప్రచురణా సంస్థ “మక్తబా దారుస్సలాం” ఆహ్వానంపై రియాద్‌లో స్థిరపడి ఇస్లామీయ సాహితీ సేవలను అందించసాగారు. **‘బులూగుల్ మరామ్’, ‘సహీహ్ ముస్లిం’** గ్రంథాలకు ఆయన అరబీలో వ్రాసిన వ్యాఖ్యానాలు ఎన్నదగినవి. **‘అహ్సనుల్ బయాన్’** పేరుతో ఉన్న ఖుర్ఆన్ వ్యాఖ్యానాన్ని ఆయన పరిశీలించి, మెరుగులు దిద్దారు. (ఈ వ్యాఖ్యానం తెలుగులో **‘అంతిమ దైవ గ్రంథం ఖుర్ఆన్’** పేరుతో అను వాదం చేసే భాగ్యం నాకు కల్పించినందుకు అల్లాహ్‌కు వేనవేల కృతజ్ఞతలు)

మౌలానా సఫీవుర్రహ్మాన్ నిరాడంబర జీవి. వినయశీలి. సున్నిత మనస్కులు. ఆయన మాటల్లోనూ, రచనల్లోనూ అణకువ, వినమ్రత ఉట్టిపడుతూ ఉంటుంది. బహుశా ఈ కారణంగానే కాబోలు అల్లాహ్ ఆయన్ని ధార్మిక జగతిలో 'మహా మనీషి'గా నిలబెట్టాడు. నేను 2000 ఆగస్టులో జమీయతె అహ్లె హదీసు (బ్రిటన్) కాన్ఫరెను సందర్భంగా ఆయన్ని బర్మింగమ్‌లో కలుసుకోవడం జరిగింది. ఆ సమయంలోనే ఆయన వ్యాఖ్యాన సహిత **'బులూగుల్ మరామ్'**కు తెలుగు రూపం **(హదీసు మకరందం)** ఇవ్వాలన్న ఆలోచన మొగ్గ తొడిగింది. ఆయన రచించిన 'అర్రహీఖుల్ మఖ్తూమ్' సీరత్ గ్రంథాన్ని సంక్షిప్తం చేసి తెలుగు పాఠకుల ప్రయోజనార్థం **'ముఖ బంధిత మధు కలశం'** అన్న పేరుతో నెలవంక ఎగ్జిక్యూటివ్ ఎడిటర్ మౌలానా సయ్యిద్ అబ్దుస్సలాం ఉమ్రీ గారు అనువదించారు.

ఈ పుస్తక అనువాదం **'నెలవంక'**లో ధారావాహికంగా వచ్చింది. అనువాదం సరళంగా, సాఫీగా సాగింది. మౌలానా సయ్యిద్ అబ్దుస్సలామ్ ఉమ్రీ గారిది తీవ్రంగా పరిశ్రమించే తత్వం. 2005 వరకూ రచనా ప్రక్రియకు దూరంగా ఉన్న ఈ యువకుడు 2006 నుండి **నెలవంక**తోను, గీటురాయితోను అనుబంధాన్ని పెంచుకుని కఠోరంగా పరిశ్రమించారు. తెలుగు భాషపై పట్టును సంపాదించటానికి నిరంతర సాధన చేసి, 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న దానికి ప్రబల తార్కాణంగా నిలిచారు. ఈ నవ యువకుని కలం ద్వారా జాలువారే మరెన్నో రచనలు, అనువాదాలలోని మాధుర్యాన్ని తెలుగు పాఠకులు ఆస్వాదించబోతున్నారు – ఇన్షాఅల్లాహ్! కారుణ్య ప్రభువు ఈయన హృదయాన్ని మరింతగా విప్పాలని, అల్లాహ్ ఈ పుస్తక ముద్రణను దయతో ఆమోదించి శుభాన్ని సమకూర్చాలని, దీని ద్వారా పాఠకులకు ఎంతో మేలు చేకూరాలని దుఆ (ఆమీన్!)

**– ముహమ్మద్ అజీజుర్రహ్మాన్**
**ఎడిటర్, నెలవంక**
తేదీ: 13-10-2010

# పవిత్ర జీవితం

అరబ్బులు పూర్వం అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించేవారు. అయితే కాలక్రమేణా వారు ఈ మార్గాన్ని విస్మరిస్తూ, మరిచిపోతూ వచ్చారు. సిరియా దేశస్థులు విగ్రహాలను పూజించటం చూసి, వారు సయితం క్రమేణా విగ్రహారాధనకి పాల్పడ్డారు. ప్రతి తెగవారికీ వారి ప్రత్యేక విగ్రహం ఉండేది (భారత దేశంలో కుల దైవం లాంటిది)..... ఇది చాలదన్నట్లు, (ఏకదైవారాధన ఉద్దేశ్యంతో నిర్మితమైన) పవిత్ర కాబాను సయితం అనేకానేక విగ్రహాలతో నింపేశారు.

## ముందు మాట

"సర్వలోకాల పాలిట మూర్తీభవించిన కారుణ్యం" అని దైవం కితాబిచ్చిన మానవ మహోపకారి ముహమ్మద్ (ﷺ) గారి సుచరితము సమస్త మానవాళికి ఒక మహత్తర సందేశం. ఈ సందేశం ద్వారా ఆయన (ﷺ) మానవతను కటిక చీకట్ల నుండి వెలికి తీసి వెలుగు చూపించారు. వ్యక్తి పూజా సంకెళ్ళ నుండి విముక్తి ప్రసాదించి, దైవ దాస్యం వంటి అత్యుత్తమమైన మార్గాన్ని నిర్దేశించారు. కేవలం ఆధ్యాత్మిక రంగాన్నే కాక మానవ జీవితానికి సంబంధించిన ప్రతి విభాగాన్ని అపురూపంగా, అద్వితీయంగా సంస్కరించారు. కనుక దైవ అంతిమ ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారి సంస్కరణోద్యమం గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలంటే, ఆనాటి అరేబియా సమాజ స్థితిగతులను, ఆయన రాకకు గల కారణాలను కూలంకషంగా తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

### అరేబియా భౌగోళిక పరిస్థితి

అరేబియా ద్వీపకల్పానికి పడమరన ఎర్ర సముద్రం, సినాయ్ ద్వీపం ఉండగా, తూర్పు భాగాన పర్షియన్ జలసంధి, దక్షిణాన హిందూ మహా సముద్రాన్ని తాకిన సువిశాల అరేబియా సముద్రం ఉంది. ఉత్తరాన సిరియా ఇరాక్ పట్టణాలున్నాయి. ప్రకృతి పరంగానూ, భౌగోళికంగానూ అరేబియా దేశం ఎంతో కీలకమైనది. ఇక అంతర్గతంగా చూస్తే లోపలి భూభాగం నలువైపుల నుండి ఎడారి, ఇసుక తిన్నెలతో కూడినది. ఈ కారణంగానే అరేబియా ఓ సురక్షితమైన కోటలా తయారయ్యింది. విదేశీయుల పెత్తనానికి అది అవకాశమివ్వలేదు. తత్కారణంగా అరబ్బులు జీవితపు అన్ని రంగాల్లోనూ (ఆనాడు) స్వేచ్ఛాపరులై ఉండటం మనం చూస్తాం. వారి చుట్టూ పర్షియా, రోము లాంటి గొప్ప సామ్రాజ్యాలున్నప్పటికీ అవేవీ అరబ్బులను వశపరచుకోలేకపోయాయి.

## అరేబియా రాజ్యం

అరేబియా ద్వీపం అసంఖ్యాకమైన తెగలతో కూడుకున్నది. ఒక్కో తెగకి ఒక్కో నాయకుడుండేవాడు. ప్రతి తెగ తన స్థానంలో ఒక ప్రత్యేక ప్రభుత్వాన్ని పోలి ఉండేది. రాజులకు ఉన్నంత వైభవం, ఘనత ఆ తెగ నాయకులకు ఉండేది. యుద్ధ సమయాల్లోనైతేనేమీ, విరామ సమయాల్లోనైతేనేమీ ప్రతి తెగ తన నాయకుడి తీర్పునే అమలు పర్చేది. ఇక మక్కా నగరం గల హిజాజ్ ప్రభుత్వం విషయానికొస్తే, అక్కడ నివసించే తెగల్లో ప్రముఖులు ఖురైషులు. పవిత్ర 'కాబా' మూలంగానూ, ఆ ప్రతిష్ఠాలయ నిర్వహణా బాధ్యత వహించటం మూలంగా కూడా ఖురైష్ వంశానికి అరబ్బుల్లో విశిష్ఠ స్థానం ఉండేది. అరబ్బులంతా వారిని గౌరవించేవారు. అలాగే మక్కా నగరం, తూర్పు – పడమరల నుంచి, ఉత్తర దక్షిణాల నుంచి వచ్చేపోయే వర్తక బృందాలకు కేంద్ర బిందువుగా ఉండేది.

## అరేబియా మతాలు

అరబ్బుల్లో అధికులు ప్రవక్త ఇస్మాయీల్ ﴾عليه السلام﴿ గారి పిలుపుని అంగీకరించినవారే. ఆయన ﴾عليه السلام﴿ వారిని తన తండ్రి ప్రవక్త ఇబ్రాహీమ్ ﴾عليه السلام﴿ అందజేసిన జీవన విధానం వైపు పిలిచారు. అది 'దీనె హనీఫ్' (ఏకాగ్రతా ధర్మం)గా ప్రసిద్ధి చెందింది. అరబ్బులు పూర్వం అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించేవారు. అయితే కాలక్రమేణా వారు ఈ మార్గాన్ని విస్మరిస్తూ, మరిచిపోతూ వచ్చారు. సిరియా దేశస్థులు విగ్రహాలను పూజించటం చూసి, వారు సయితం క్రమేణా విగ్రహారాధనకి పాల్పడ్డారు. ప్రతి తెగవారికీ వారి ప్రత్యేక విగ్రహం ఉండేది (భారత దేశంలో కుల దైవం లాంటిది). వారు పూజించే విగ్రహాల్లో ప్రసిద్ధమైనవి – 'లాత్' – ఈ విగ్రహం తాయిఫ్ ప్రజల ఇష్ట దైవంగా పూజలందుకొనేది. 'మనాత్' నఖ్లా ప్రాంతంలో పూజింపబడేది. ఇది చాలదన్నట్లు, (ఏకదైవారాధన ఉద్దేశ్యంతో నిర్మితమైన) పవిత్ర కాబాను సయితం అనేకానేక విగ్రహాలతో నింపేశారు. ప్రవక్త ముహమ్మద్ ﴾ﷺ﴿ గారు మక్కాలో విజేతగా ప్రవేశించినప్పుడు కాబా చుట్టూ 360 విగ్రహాలుండటాన్ని గమనించారు.

అప్పుడు వాటిని 'కాబా' గృహం నుండి బైట పడేసి కాల్చివేయడం జరిగింది. విగ్రహాలను పూజించడంలో కూడా అరబ్బులకు కొన్ని ప్రత్యేక ఆచారాలు, రీతి రివాజులుండేవి. ముఖ్యంగా కష్ట కాలంలో వారు తమ ఇష్ట దైవాలను ఆశ్రయించే వారు. సహాయం కోసం అర్థించేవారు. అవి తమ మొరలను ఆలకిస్తాయని, తమ కోరికల్ని తీరుస్తాయని భావించేవారు. వాటి చుట్టూ ప్రదక్షిణలు చేసేవారు. వాటి కోసం ప్రయాణాలు (హజ్) చేసేవారు. వాటి ముందు మోకరిల్లేవారు. అనేక రీతి రివాజులతో వాటికి దగ్గరవ్వాలని పరితపించేవారు.

ఆ విగ్రహాల పేరున బలులు ఇచ్చేవారు. వాటి పేరున రకరకాల నైవేద్యాలు పెట్టేవారు. ఇంకా తాంత్రికులు, జోతిష్కులు, నక్షత్రాల విద్య గలవారు చెప్పే భవిష్య వాణుల్ని, అగోచర విషయాల్ని ఇట్టే నమ్మేవారు. అలాగే అరబ్బులు శకునాలు అప శకునాల్ని సయితం నమ్మేవారు. వారు ఏదైనా కార్యం చెయ్యాలంటే ఒక పక్షిని వదిలే వారు. అది గనక కుడి వైపు వెళితే మంచి శకునంగా భావించి తాము తలచిన కార్యాన్ని నెరవేర్చేవారు. ఒకవేళ అది ఎడమ ప్రక్కకు వెళితే అపశకునంగా భావించి తమ కార్యాన్ని వాయిదా వేసుకునేవారు లేదా మానుకునేవారు.

ఇన్ని మూఢ నమ్మకాలు, అపసవ్యమైన పోకడలు వారిలో ఉన్నప్పటికీ, ప్రవక్త ఇబ్రాహీమ్ (అలైహిస్సలాం) గారి ధర్మపు వారసత్వ ఛాయలు వారిలో ప్రస్ఫుటంగానే గోచ రించేవి. ఉదాహరణకు 'కాబా' గృహ ప్రాశస్త్యాన్ని కాపాడటం, దాని పట్ల గౌరవ భావం కలిగి ఉండటం, దాని చుట్టు ప్రదక్షిణ (తవాఫ్) చేయటం, హజ్ ఉమ్రాలు చేయటం, అరఫా ముజ్దలిఫాల్లో విడిది చేయటం లాంటివి చేసేవారు. అయితే వారి మతం విగ్రహారాధన మతమే. ఇక యమన్, మదీనా ప్రాంతాలలో యూదులు కూడా అక్కడక్కడా నివసించేవారు. క్రైస్తవులు మాత్రం అరేబియాకు దక్షిణ ప్రాంతాల్లోనూ, యమన్‌లోను ఉండేవారు. అలాగే కొన్ని అరబ్బు తెగలు ఈరాన్ మరియు బహ్రైన్ పరిసరాల్లో మజూసీ (అగ్ని పూజారుల) మతాన్ని అవలంబించేవారు.

## సామాజిక జీవితం

ఇస్లాంకు పూర్వం అరేబియా సమాజం అనేక వర్గాలతో కూడి ఉండేది. అగ్ర వర్గం అని, మధ్యమ వర్గమని, అధమ వర్గమని విభజితమై ఉండేది. పై వర్గానికి చెందిన వారికి మనసులోని మాట నిర్మొహమాటంగా చెప్పే పూర్తి స్వేచ్ఛ ఉండేది. స్త్రీ పురుష సంబంధాలు కూడా సహజంగానే ఎంతో సంస్కారవంతంగా ఉండేవి. స్త్రీ పురుష సంబంధాలు బంధు మిత్రుల ఆధ్వర్యంలో 'పెళ్ళి' అనే పవిత్ర బంధంతోనే ఏర్పడేవి. అయితే ఇతర వర్గాల్లో మాత్రం స్త్రీపురుష కలయిక వివిధ రకాలుగా ఉండేది. ఉదాహరణకు: విచ్చలవిడితనం, విశృంఖలత్వం, వ్యభిచారం, అక్రమ సంబంధం వగైరా. పూర్వం వారు లెక్కలేనన్ని పెళ్ళిళ్ళు చేసుకునేవారు. అక్కాచెల్లెళ్ళను ఏక సమయంలో పెళ్ళి చేసుకోవడం, తండ్రులు గనక విడాకులిస్తే లేదా మరణిస్తే సవతి తల్లుల్ని మనువాడటం వారిలో సర్వ సాధారణ విషయం.

సంతానాన్ని సమ దృష్టితో చూసేవారు కాదు. అవమానం, పేదరికం భయంతో వారు తమ ఆడ పిల్లల్ని సజీవ సమాధి చేసేవారు. కుటుంబ సభ్యులతోనూ, పిన తండ్రి పిల్లలతోనూ, వారి సంబంధం ఎంతో పటిష్టంగా ఉండేది. వారు అభిజాత్యం కోసం చావడానికైనా, చంపడానికైనా వెనుకాడేవారు కాదు. "నీ సోదరుడు దౌర్జన్య

పరుడైనా, బాధితుడైనా రెండు సందర్భాల్లోనూ అతనికే వత్తాసు పలుకు" అనే సూత్రాన్ని పాటించేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ అరబ్బుల సామాజిక వ్యవస్థ పతన స్థాయికి దిగజారి ఉండేది. పూర్వీకుల అంధానుసరణ వల్ల, అంధవిశ్వాసాలు, మూఢా చారాలను ఆశ్రయించడం మూలాన వారి బుద్ధివివేకాలు స్థంభించాయి. తత్కారణంగా వారు పశువుల్లా జీవించేవారు. వారి సమాజంలో స్త్రీ అంగడి వస్తువులా అమ్ముడు పోయేది.

## ఆర్థిక స్థితి

అరబ్బులకు వ్యాపారం అతి పెద్ద జీవనాధారంగా ఉండేది. అయితే వ్యాపారం సవ్యంగా కొనసాగేది కాదు. కారణం అశాంతి అలజడులే. పవిత్ర మాసాల్లో తప్ప ఎక్కడా శాంతిభద్రతలు అనేవి కనిపించేవి కావు. ఈ మాసాల్లోనే ప్రసిద్ధి చెందిన ఉకాజ్, జిల్ మజాజ్, ముజ్నా వంటి అరబ్బు సంతలు నిర్వహించబడేవి. పోతే, వస్తుత్పత్తికి అరబ్బులు ఆమడ దూరం. యమన్, హియరా, సిరియా ప్రాంతాల్లో మాత్రం అక్కడక్కడా ఉన్న పరిశ్రమలు ఉండేవి. అరబ్బు స్త్రీలు వ్యవసాయం, గొర్రెలు మేపటం, చేతిపని లాంటివి చేసేవారు. రాజ్యంలో ఎటు చూసినా దారిద్ర్యం తాండవమాడుతున్నట్టే ఉండేది.

## నైతిక స్థితి

పూర్వం అరబ్బుల్లో మద్య సేవనం, జూదం, మగువ లోలత్వం (వ్యభిచారం) లాంటి నీతిబాహ్యమైన అలవాట్లు ఉండేవన్న సంగతి మనం నిరాకరించలేము. అయితే వారిలో గొప్ప గుణాలు, మంచి లక్షణాలు, కూడా విశేషంగానే ఉండేవి. ప్రప్రథ మంగా అరబ్బులు ఉదాత్తులు. దాతృత్వంలో అగ్రగాములు. తమలోని ఈ గుణంపై వారు గర్వపడేవారు. వణుకు పుట్టించే చలిలో, ఆకలితో అలమటిస్తున్న స్థితిలో సయితం అతిథి గనక ఇంటికి వస్తే తమ వద్ద ఒకే ఒక్క ఒంటె తప్ప మరే సంపదా లేకపోయినా, అదే వారి కుటుంబ పోషణకు మూలాధారమైనా, వారిలో ఉన్న దాతృత్వం కారణంగా ఆ జంతువును జిబహ్ చేసి అతిథి మర్యాదలు చేసేవారు.

వారిలో ఉన్న మరో సుగుణం ఆత్మాభిమానం, ఇచ్చిన మాటను నిలబెట్టుకోవటం. ఆడిన మాట నిలబెట్టుకోవడం కోసం ఎంతటికైనా తెగించేవారు. చివరికి తమ సంతానాన్ని త్యాగం చెయ్యడానికి సయితం తటపటాయించేవారు కారు. ఇంకా వారిలో ఆత్మ గౌరవం, నిరాడంబరత, సంకల్ప నిరతి, కార్య దీక్ష దక్షతలు ఉండేవి. తాము తలచిన దాన్ని సాధించడానికి తమ జీవితాన్ని సయితం ధారబోసేలా క్రియారంగంలో దిగేవారు. అరబ్బుల ఈ గుణగణాలు, విశేష లక్షణాలు, ప్రత్యేకతల మూలంగానే దేవుడు తన అంతిమ సందేశ ప్రచార బాధ్యత కోసం సర్వ మానవాళికి సంబంధించిన సంస్కరణోద్యమం కోసం వారిని ఎన్నుకున్నాడు.

## ప్రవక్త (ﷺ) గారి వంశావళి

అబ్దుల్ ముత్తలిబ్ కుమారుడైన అబ్దుల్లాహ్ మహనీయ ముహమ్మద్ (ﷺ) గారి తండ్రి. వంశ పరంపర: **ముహమ్మద్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ బిన్ హాషిమ్ బిన్ అబ్దు మునాఫ్ బిన్ ఖుసై బిన్ కిలాబ్ బిన్ ముజ్జా బిన్ కఅబ్ బిన్ లువై బిన్ గాలిబ్ బిన్ ఫహర్ బిన్ మాలిక్ బిన్ నజర్ బిన్ కనానా బిన్ ఖుజైమా బిన్ ముద్రికా బిన్ ఇల్యాస్ బిన్ ముజర్ బిన్ నజార్ బిన్ మఅద్ బిన్ అద్నాన్.**

మహనీయ ముహమ్మద్ (ﷺ) ఖురైష్ వంశానికి చెందినవారు. ఖురైష్ వంశం అరబ్బుల్లో ఎంతో ఉన్నతమైన, ఆదరణీయమైన వంశంగా కొనియాడబడుతూ వచ్చింది. అరబ్బులు ప్రవక్త ఇబ్రాహీమ్ (అలైహిస్సలాం)గారి జేష్ఠ పుత్రుడు అయిన ఇస్మాయీల్ (అలైహిస్సలాం)గారి వంశానికి చెందినవారు. ఖురైష్ వంశీయులు కాబా గృహ నిర్వాహకులుగా హజ్ యాత్రీకులకు నీటి వసతి కల్పించటం, వారికి భోజన సదుపాయాలు సమ కూర్చటం లాంటి సేవలందించేవారు.

## 1- హాషిమ్

ఈయన గొప్ప కీర్తిప్రతిష్టలు గల వ్యక్తి. కాబా గృహ నిర్వాహకుడిగా ఎన్నికయ్యారు. దీనివల్ల ఈయన ఖ్యాతి మరింత పెరిగింది. హజ్ యాత్రికులకు భోజన సదు పాయాలు కల్పించిన మొదటి వ్యక్తిగా చరిత్ర ఈయన్ను గుర్తిస్తోంది. ఈయన గారి అసలు పేరు అమ్ర్. అయితే యాత్రికుల కోసం రొట్టె, మాంసం తయారు చేసి పెట్టే వారు గనక 'హాషిమ్' అన్న బిరుదు లభించింది. ఈ కారణంగానే ప్రవక్త (ﷺ) వారి వంశాన్ని హాషిమీ అని కూడా పిలుస్తారు. ఆ బిరుదే తర్వాత ఆయన పేరుగా ఖ్యాతికెక్కింది. ఖురైషుల కోసం సంవత్సరానికి రెండు ప్రయాణాలు నిర్ధారించింది కూడా ఈయనే. ఒకటి చలికాలంలో, రెండవది: ఎండా కాలంలో.

## 2- అబ్దుల్ ముత్తలిబ్

ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారి తాత, హాషిమ్ కుమారుడు అబ్దుల్ ముత్తలిబ్ ఖురైష్ వంశానికి నాయకుడు. ఈయన కాబా గృహ హజ్ యాత్రికుల నిర్వాహకుడు. అబ్దుల్ ముత్తలిబ్‌కు 10 మంది సంతానం. వారందరిలో ప్రముఖులు, ప్రసిద్ధికెక్కిన వారు – 1) అబ్దుల్లాహ్, 2) అబూ తాలిబ్, 3) హమ్జా, 4) అబ్బాస్, 5) అబూ లహబ్.

ఆయనకు ఆరుగురు కూతుళ్ళు. 1) ఉమ్మె హకీమ్ 2) ఆతిఖా 3) సఫియ్యా 4) బర్రా 5) ఉర్వ 6) ఉమైమా. అబ్దుల్ ముత్తలిబ్ జీవితకాలంలో కాబా గృహానికి సంబంధించిన రెండు సంఘటనలు చోటు చేసుకున్నాయి.

**అ) జమ్ జమ్ బావి త్రవ్వకం ఆ) ఏనుగుల సంఘటన**

## అ) జమ్ జమ్ బావి త్రవ్వకం

ఒక సుదీర్ఘ కాలం గడవటం వల్ల 'పూడిపోయిన జమ్‌జమ్ బావిని వెలికి తియ్యి' అని అబ్దుల్ ముత్తలిబ్ గారికి కలలో ఆజ్ఞాపించబడటంతోపాటు, ఆ బావి స్థలాన్ని సయితం వర్ణించడం జరిగింది. అప్పుడు ఆయన బావి త్రవ్వనారంభించారు. చివరికి నీళ్ళు రానే వచ్చాయి. అప్పటి నుండి జమ్ జమ్ నీటిని హజ్ యాత్రికులకు త్రాపించ సాగారు అబ్దుల్ ముత్తలిబ్.

## ఆ) ఏనుగుల సంఘటన

క్లుప్తంగా చెప్పాలంటే అబిసీనియా చక్రవర్తి అయిన నజాషీ గవర్నర్‌గా యమన్‌లో ఉంటున్న అబ్రహా, అరబ్బులు కాబా గృహం వైపు ప్రయాణాలు చేయడం చూసి 'సన్‌ఆ' అనే ప్రాంతంలో బ్రహ్మాండమైన ఓ చర్చిని నిర్మించాడు. అరబ్బులు కాబాను వదిలి ఈ చర్చి వైపు ఆకర్షితులవ్వాలన్నది అతని ఉద్దేశ్యం. ఇది విన్న కనాన్ తెగకు చెందిన ఒక వ్యక్తి రాత్రి సమయంలో ఆ చర్చిలో ప్రవేశించి దాన్ని మలిన పర్చాడు (మల మూత్రాలు విసర్జించాడు.) దాంతో అబ్రహా క్రోధావేశంతో ఊగిపోయాడు. 60 వేల మంది సైనికుల్ని తీసుకుని కాబా గృహాన్ని నేలమట్టం చేసే దురుద్దేశ్యంతో బయలుదేరాడు. తన స్వారీ కోసం పెద్ద ఏనుగును ఎన్నుకున్నాడు. అతని సైన్యంలో తొమ్మిది లేదా 13 ఏనుగులున్నాయి. అబ్రహా మక్కా పట్టణం పొలిమేరలకు చేరగానే సైన్యం ముందు నడుస్తున్న ఓ ప్రత్యేక ఏనుగు హఠాత్తుగా ఆగిపోయి, నేల మీద చతికిలబడింది. శత విధాల ప్రయత్నించినా అది కదల్లేదు. విచిత్రం ఏమిటంటే– ఉత్తర, దక్షిణ, తూర్పు దిక్కుకు తిప్పి అదిలిస్తే చాలు అది పరుగెత్తేది. కాని కాబా వైపు తిప్పగానే అది మొండికేసేది. అంతలోనే అల్లాహ్ వారి మీదికి అబాబీల్ అనే పక్షుల్ని గుంపులు గుంపులుగా పంపాడు. అవి వారి మీద కంకర్రాళ్ళు విసిరేవి. దాంతో వారు పశువులు తిని తొక్కి వేసిన పొట్టులా సర్వనాశనం అయ్యారు. ప్రతి పక్షితోటే మూడు కంకర్రాళ్ళుండేవి. ఒకటి నోటిలో, రెండు కాళ్ళలో. ఆ రాళ్ళు తగిలిన ప్రతి వ్యక్తి అవయవాలు ఊడి క్రింద పడిపోసాగాయి. వారంతా సర్వనాశనమైపోయారు. అల్లాహ్ అబ్రహాను ఓ వ్యాధికి గురి చేశాడు. ఆ వ్యాధి కారణంగా అతని చర్మం చిట్లి మాంసం క్రింద పడసాగింది. దానికితోడు విపరీతమైన దురద కూడా ఉండేది. అతను 'సన్‌ఆ' చేరగానే మృత్యు వాతన పడ్డాడు. ఏనుగుల సంఘటన ముహర్రమ్ నెలలో జరిగింది. అంటే దైవ ప్రవక్త (ﷺ) గారి ఆగమనానికి, జననానికి యాభై లేదా యాభై ఐదు రోజుల ముందు అన్న మాట.

# మహా ప్రవక్త (ﷺ) గారి పితామహులు అబ్దుల్లాహ్

అబ్దుల్లాహ్ గారి తల్లి పేరు ఫాతిమా. అబ్దుల్ ముత్తలిబ్ సంతానంలోకెల్లా అందమైనవారు, ఆకర్షణ గలవారు అబ్దుల్లాయే అందరికన్నా ఎక్కువగా అబ్దుల్ ముత్తలిబ్‌కు ప్రియతముడు. ఆయన జబీహ్‌గా పిలువబడేవారు. అదెలాగంటే–, తనకు పది మంది కొడుకులు పుట్టాక వారిలోని ఒకరిని కాబా గృహం వద్ద బలి ఇస్తానని మొక్కుకున్నారు అబ్దుల్ ముత్తలిబ్. అందరి పేర్లు బాణాలపై వ్రాసి, ఆ బాణాలను హుబుల్ విగ్రహ పూజారికిచ్చారు. అతను (ఓ ప్రత్యేక పద్ధతిలో) వాటిని తిప్పగా, బాణం అబ్దుల్లాహ్ పేరున వచ్చింది. అంతే. కత్తి చేబూని అబ్దుల్లాహ్‌ను బలివ్వడానికి కాబా గృహం వైపు బయలుదేరారు అబ్దుల్ ముత్తలిబ్. ఖురైష్ ప్రజలంతా ఆయన్ను బలివ్వద్దని వారించారు. బంధువులు, తమ్ముళ్ళు, అబూ తాలిబ్ కూడా అడ్డుపడ్డారు.

మరి నా మొక్కుబడి సంగతేంటి? అన్నారు అబ్దుల్ ముత్తలిబ్. మంత్రగత్తె వద్దకు వెళ్ళి ఈ సమస్యకు పరిష్కారం అడుగుదాం అని అక్కడున్నవారందరూ సలహా ఇచ్చారు. ఆ మంత్రగత్తె..."అబ్దుల్లాహ్ పేరున పది ఒంటెలకు పాచికలు వేసి చూడండి. ఒకవేళ అబ్దుల్లాహ్ పేరున వస్తే మరో పది చేర్చండి. ఇలా అతని ప్రభువు ప్రసన్నుడయ్యే వరకు చేయండి. ఎప్పుడైతే ఒంటెల పేరు మీద వస్తుందో అప్పుడు ఒంటెల్ని బలివ్వండి" అని సలహా ఇచ్చింది.

అబ్దుల్ ముత్తలిబ్ అక్కడ నుండి బయలుదేరారు. మంత్రగత్తె చెప్పినట్లే పాచికలు వేశారు. అబ్దుల్లాహ్ పేరు వచ్చింది. అలా పది, పది ఒంటెల చొప్పున పెంచుకుంటూ పోయారు. ఒంటెల సంఖ్య వందకు చేరిన తరువాత ఒంటెల పేరు వచ్చింది. అప్పుడు ఆయనకి బదులు వాటిని బలిచ్చారు. ఆ తర్వాత అబ్దుల్ ముత్తలిబ్ వాటిని ఏ మనిషీ ముట్టకుండా, ఏ తోడేలూ దగ్గరికి రాకుండా అలాగే పడేశారు. ప్రవక్త (ﷺ) ఓ సందర్భాన – **"నేను ఇబ్నుజ్జబీహతైన్"**ని అని అభిప్రాయపడ్డారు. అంటే, ప్రవక్త ఇస్మాయీల్ (అ) మరియు అబ్దుల్లాహ్‌ల పుత్రుణ్ణి అని భావం.

అబ్దుల్ ముత్తలిబ్ గారు తన ముద్దుల కొడుకు పెళ్ళి కోసం వహబ్ బిన్ అబ్దు మునాఫ్ కుమార్తె **'ఆమినా'**ను వధువుగా ఎంపిక చేశారు. ఆమె ఖురైష్ వంశస్థుల్లో కెల్లా వంశం రీత్యాను, హోదా అంతస్థుల దృష్ట్యానూ పుణ్య స్త్రీగా పరిగణించబడేది. ఆమె తండ్రి 'బనూ జహ్రా' తెగ నాయకుడు. ఆ సుగుణాల రాసితో అబ్దుల్లాహ్

వివాహం జరిపించారు. కొన్నాళ్ళ తర్వాత అబ్దుల్ ముత్తలిబ్ ఖర్జూరాల కోసమని కొడుకును మదీనా పట్టణానికి పంపారు. అబ్దుల్లాహ్ అక్కడే మరణించారు. మరో కథనం ప్రకారం: అబ్దుల్లాహ్ వ్యాపార నిమిత్తం సిరియా వెళ్ళాల్సి వచ్చింది. తిరుగు ప్రయాణంలో మదీనాలో విడిది చేశారు. అప్పుడు ఆయన జ్వరంతో బాధ పడుతూ అక్కడే కాలధర్మం చెందారు. అప్పటికి ఆయన వయసు 25 సంవత్సరాలు. మహా ప్రవక్త (ﷺ), తల్లి కడుపులో ఉండగానే ఈ సంఘటన జరిగింది. అబ్దుల్లాహ్ తన వెనక వదలి వెళ్ళిన ఆస్తిలో మొత్తం ఐదు ఒంటెలు, కొన్ని గొర్రెలు, ఉమ్మే ఐమన్‌గా పిలువబడే 'బరకత్' అనే నీగ్రో బానిస స్త్రీ. ఆమె గారే మొదట ముహమ్మద్ (ﷺ)ను ఒడిలో తీసుకున్న అదృష్టవంతురాలు.

## జననం - దైవ దౌత్యానికి పూర్వం 40 సంవత్సరాలు

విశ్వనాయకుడు (ﷺ) రబీవుల్ అవ్వల్ 9వ తేది (క్రీ.శ 571 ఏప్రిల్ నెల 20వ తేది) సోమవారం నాడు జన్మించారు. ఇబ్ను సాద్ కథనం ప్రకారం– మహా ప్రవక్త (ﷺ) గారి తల్లి ఇలా అభిప్రాయపడ్డారు: "నేను ముహమ్మద్ (ﷺ) ను ప్రసవించినప్పుడు నా నుండి అనిర్వచనీయమైన ఓ అద్భుత కాంతి వెలువడింది. అది సిరియా భవనాలన్నింటినీ వెలుగుతో నింపేసింది". మరికొన్ని కథనాల ప్రకారం – ఆ సందర్భంగా కొన్ని విచిత్ర సంఘటనలు జరిగాయి. తరాల తరబడి మజూసీలు పూజించే అగ్ని ఒక్క సారిగా చల్లారిపోయింది. బుహైరా, సావా ప్రాంతాల్లోని విగ్రహాలయాలు కూలిపోయాయి.

మహా ప్రవక్త పుట్టారన్న శుభవార్తను తల్లి ఆమినా మొదట తాతగారైన అబ్దుల్ ముత్తలిబ్ గారికి అందజేశారు. ఈ వార్త వినగానే సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బవుతూ ఒక్క ఉదుటున ఇంట్లో ప్రవేశించారు అబ్దుల్ ముత్తలిబ్. తర్వాత ఆ పసి పిల్లవాడిని తీసుకుని కాబా గృహంలో ప్రవేశించి, అల్లాహ్‌కు కృతజ్ఞతాభినందనలు తెలిపారు. ఆ బాలుడికి 'ముహమ్మద్' అని నామకరణం చేశారు. ప్రవక్త గారి తల్లి తర్వాత బాబాయి (అబూ లహబ్) ఇంట్లో పనికత్తెగా ఉన్న 'సౌబియా' ఆయనకు పాలు త్రాపించే భాగ్యాన్ని తన సొంతం చేసుకుంది.

# శుభాలు పొంగి పొర్లిన వేళ...

## బనూ సఅద్‌లో...

సాధారణంగా అరేబియా పట్టణ వాసుల్లో తమ పిల్లల్ని పాలు త్రాగించి పోషించడానికి ఆయాలకు అప్పగించి పల్లె వాసాలకు పంపే ఆచారం ఉండేది. కారణం –

1) పల్లెల్లో సహజ వాతావరణంలో పిల్లలు వ్యాధులకు దూరంగా ఆరోగ్యంగా పెరుగుతారని, దృఢకాయులుగా, ధైర్యవంతులుగా తయారవుతారని వారి నమ్మకం.

2) తమ పిల్లలు పసితనం నుంచే స్వచ్ఛమైన అరబీ భాష నేర్చుకోవాలని, అరబీ లోకోక్తులపై పట్టు సాధించాలని.

**"దైవ ప్రవక్త (ﷺ) బాల్యంలో తోటి పిల్లలతో ఆడుకుంటూ ఉండగా, ఆయన వద్దకు జిబ్రయీల్ దూత వచ్చారు. వచ్చీ రాగానే ప్రవక్త (ﷺ) గారిని పరుండబెట్టి వడిసి పట్టుకున్నారు. ఆయన రొమ్మును పరికరంతో చీల్చి గుండెకాయను బయటికి తీసారు. దాని నుండి ఓ భాగాన్ని వేరుపర్చి ఇది మీలోని షైతాన్ భాగం అన్నారు. ఆ తరువాత పసిడి పళ్ళెంలో ఉంచి గుండెకాయను జమ్‌జమ్ జలంతో శుభ్రంగా కడిగి, దాన్ని మళ్ళీ దాని స్థానంలో పెట్టి అమర్చేశారు.**

అబ్దుల్ ముత్తలిబ్ గారు మహా ప్రవక్త (ﷺ) కోసం ఆయాల అన్వేషణ ప్రారంభించారు. చివరికి సాద్ తెగకు చెందిన స్త్రీ– అబూ జువైబ్ కుమార్తె హలీమా, ముహమ్మద్ (ﷺ)కు పాలు తాపించే, పోషించే బాధ్యతను స్వీకరించింది. ముహమ్మద్ (ﷺ)తో పాటు పాలు త్రాగిన వారిలో హారిస్ కుమారుడు అబ్దుల్లాహ్, హారిస్ కుమార్తె షీమా ఉన్నారు. ఆయా హలీమా ముహమ్మద్ (ﷺ) ద్వారా ప్రాప్తమయిన శుభాలను కళ్ళారా తిలకించింది. ఆమె మాటల్లోనే చెప్పాలంటే, ఆమె బాల ముహమ్మద్ (ﷺ)ను ఒడిలో తీసుకున్న మరుక్షణమే ఆమె స్తనాలు పాలతో నిండిపోయాయి. ఆమె గొర్రెలు లావెక్కాయి. వాటి పాలు రెట్టింపయ్యింది. గొర్రెలు మేసే చోట కూడా గడ్డి దట్టంగా మొలిచింది. పూర్వం అదే నేల బీడువారి ఉండేది. మహనీయ ముహమ్మద్ (ﷺ) పెరిగి పెద్ద వారవుతున్న కొద్దీ ఆ శుభాలు కూడా అధికమవ్వసాగాయి. రెండేళ్ళు నిండాక హలీమా ఆ బాలుడ్ని అమ్మ ఆమినా వద్దకు తీసుకు వచ్చింది. కాని అక్కడ అంటు వ్యాధి ప్రబలి ఉన్న కారణంగా మళ్ళీ హలీమా సాదియా, తల్లి ఆమినా కోరికపై బాల ముహమ్మద్ (ﷺ)ను మరోసారి తన పల్లెకు తీసుకుపోయింది.

ఇలా మహా ప్రవక్త (ﷺ) బనూ సఅద్‌తో పల్లె వాతావరణంలో ఉండసాగారు. ఆయనకు నాలుగు లేదా ఐదు ఏళ్ళు నిండి ఉంటాయి. రొమ్ము చీల్చిన (షఖ్ఖె సదర్) సంఘటన జరిగింది. ముస్లిం హదీసు గ్రంథంలో హజ్రత్ అనస్ (ﷺ) గారి కథనం ఇలా ఉంది: "దైవ ప్రవక్త (ﷺ) బాల్యంలో తోటి పిల్లలతో ఆడుకుంటూ ఉండగా, ఆయన వద్దకు జిబ్రయీల్ దూత వచ్చారు. వచ్చీ రాగానే ప్రవక్త (ﷺ) గారిని పరుండ బెట్టి వడిసి పట్టుకున్నారు. ఆయన రొమ్మును పరికరంతో చీల్చి గుండెకాయను బయటికి తీసారు. దాని నుండి ఓ భాగాన్ని వేరుపర్చి ఇది మీలోని షైతాన్ భాగం అన్నారు. ఆ తరువాత పసిడి పళ్ళెంలో ఉంచి గుండెకాయను జమ్‌జమ్ జలంతో శుభ్రంగా కడిగి, దాన్ని మళ్ళీ దాని స్థానంలో పెట్టి అమర్చేశారు. ఈ దృశ్యాన్ని చూసిన పిల్లలంతా ఆయా హలీమా దగ్గరకు వచ్చి – "ముహమ్మద్ హత్య చెయ్య బడ్డాడు, వెళ్ళి చూడండి" అన్నారు.

## మాతృమూర్తి ఒడికి

ఈ సంఘటన తరువాత ఆయా హలీమాకు ముహమ్మద్ (ﷺ) గురించి చింతన ఎక్కువయింది. చివరికి ఆయన (ﷺ) గారిని తీసుకొచ్చి తల్లి ఆమినాకి అప్పగించింది. ప్రవక్త (ﷺ) తన శిక్షణలో ఆరేళ్ళు నిండేంత వరకూ ఉన్నారు. అమ్మ ఆమినా అనాథ ముహమ్మద్ (ﷺ)ను వెంట బెట్టుకుని మరణించిన తన భర్త స్మృతి చిహ్నాలు చూసి రావడానికి, భర్త సమాధిని దర్శించడానికి మక్కా నుండి బయలుదేరి, యస్రిబ్ (మదీనా)కి చేరుకున్నారు. ఆమెతోపాటు ఉమ్మె ఐమన్ కూడా ఉంది. దాదాపు ఒక నెల రోజుల పాటు అక్కడ గడిపి మక్కాకు తిరుగు ప్రయాణమయ్యారు. కాని మార్గ మధ్యంలో ఓ మహమ్మారి రోగం చుట్టుముట్టింది. దాని ప్రభావంతో మదీనా మక్కాల మధ్య అబ్వా అనే ప్రాంతంలో ఆమె పరమపదించారు (అక్కడే ఆమెను సమాధి చేశారు).

## పువ్వు పుట్టగానే పరిమళించినట్టు...

అబ్దుల్ ముత్తలిబ్ తమ ముద్దుల మనవడిని తీసుకుని మక్కా చేరుకున్నారు. ముహమ్మద్ (ﷺ) అంటే ఆయనకు అమితమైన వాత్సల్యం. ఇప్పుడు కోడలు కూడా అసువులు బాసడం వల్ల అనాథ మనుమని పట్ల ఆయనకున్న ప్రేమ రెట్టింపయ్యింది. తన సంతానంలో అందరికన్నా ఈ మనవడికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు. కాబా నీడలో అబ్దుల్ ముత్తలిబ్ కోసమని ప్రత్యేకంగా పడక (సాప) వేయబడేది. ఆయన పిల్లలందరూ ఆ సాప చుట్టు కూర్చునేవారు. తండ్రి పట్ల ఉన్న గౌరవం వల్ల దానిపై కూర్చునే ధైర్యం చేసేవారు కాదు. అయితే ప్రవక్త (ﷺ) దానిపై వచ్చి కూర్చునేవారు. ప్రవక్త (ﷺ) గారి బాబాయి లందరూ కలిసి ఆయన్ను ప్రక్కకు జరపాలని ప్రయత్నించే

వారు. అప్పుడు అబ్దుల్ ముత్తలిబ్ – “నా బిడ్డను వదలండి. దైవ సాక్షిగా! ఇతని స్థానం మహోత్కృష్టమైనది” అంటూ తనతో కూర్చోబెట్టుకుని ఆయన వీపు తట్టేవారు. ప్రవక్త (ﷺ) గారి వయసు ఎనిమిది సంవత్సరాల రెండు నెలలకు చేరుకోగానే, తాత గారైన అబ్దుల్ ముత్తలిబ్ మక్కాలో తనువు చాలించారు. పోతూపోతూ మనవడి పోషణాభారం ప్రవక్త (ﷺ) గారి పెదనాన్న (ప్రవక్త గారి తండ్రి అబ్దుల్లాహ్ మరియు అబూ తాలిబ్ ఒకే తల్లి బిడ్డలు) అబూ తాలిబ్‌కు అప్పగించి వెళ్ళారు.

## మమతకు మారు పేరయిన పెదనాన్న సంరక్షణలో

అబూ తాలిబ్ తన భ్రాతృజుడ్ని అల్లారు ముద్దుగా పెంచారు. ప్రవక్త (ﷺ) గారి పట్ల ఈయనకు ప్రత్యేక ప్రేమాభిమానాలు, అవ్యాజానురాగాలుండేవి. ఒక్కోసారి తన కన్న కొడుకులపై కూడా ప్రవక్త (ﷺ) గారికి ప్రాముఖ్యం ఇచ్చేవారు. అంతే కాదు, ప్రవక్త (ﷺ) గారి ద్వారా ప్రార్థన చేయిస్తే మేఘాలు వర్షించేవి. ప్రవక్త (ﷺ) గారి బాల్యంలో ఒకసారి మక్కాలో కరువు రక్కసి ఆవహించింది. తీవ్ర ఆందోళన చెందిన ఖురైషులంతా అబూ తాలిబ్ వద్దకు వచ్చి, ‘మీరు వర్షం కోసం దైవాన్ని ప్రార్థించండి’ అని విన్నవించుకున్నారు. ఆయన బయలుదేరారు. ఆయనతోపాటు బాల ముహమ్మద్ (ﷺ) కూడా ఉన్నారు. బాల ముహమ్మద్ (ﷺ)ను కాబా గోడకు ఆనిచ్చి కూర్చోబెట్టారు. తరువాత వర్షం కోసం ప్రార్థించగా కొన్ని క్షణాల్లోనే దట్టమైన మేఘాలు క్రమ్ముకున్నాయి. ఆకాశం నుండి వర్షం కురిసింది. వీధులన్నీ ఏరులై పారాయి.

## బుహైరా - రాహిబ్ (సన్యాసి)

దైవ ప్రవక్త (ﷺ) గారికి పన్నెండవ ప్రాయంలో అబూ తాలిబ్ ఆయన్ని వెంటబెట్టుకొని వ్యాపార నిమిత్తం సిరియా వెళ్ళారు. చివరికి (ఈ వర్తక బృందం) బస్రా పట్టణం చేరుకుంది. ఈ పట్టణంలో బుహైరా పేరుతో పిలువబడే ‘జర్‌జిస్’ అనే ఓ సన్యాసి ఉండేవాడు. వర్తక బృందం సేద తీర్చుకోవడానికి అక్కడ ఆగింది. ఇది తెలుసుకున్న తను వెళ్ళి వారికి స్వాగతం పలికాడు. ఎంతో మర్యాదగా ప్రవర్తించాడు. వారందరికీ విందు ఇచ్చి తగురీతిలో సత్కరించాడు. తను గతంలో ఎన్నడూ వారి వద్దకు వచ్చిన దాఖలాలు లేవు. అతను ప్రవక్త (ﷺ) వారిని ఆయన గుణవిశేషాల ఆధారంగా పసిగట్టాడు. ప్రవక్త (ﷺ) గారి చెయ్యి పట్టుకుని ఇలా అభిప్రాయపడ్డాడు: “ఈ అబ్బాయి విశ్వనాయకుడు, ఈ బాలుడ్ని అల్లాహ్ సమస్త లోకాల పాలిట మూర్తీభవించిన కారుణ్యంగా చేసి పంపాడు”. ఈ విషయం నీకెలా తెలుసు? అని అబూ తాలిబ్ ప్రశ్నించగా “ఈ కనుమ గుండా మీరు ప్రవేశించి నప్పుడు ఇక్కడున్న ప్రతి రాయి, ప్రతి చెట్టు సాష్టాంగపడసాగాయి. అలా అవి కేవలం

లాంటి దైవ దౌత్య ముద్రతో ఆయన్ను గుర్తు పట్టాను. ఆయన ప్రస్తావన మా గ్రంథాల్లో సయితం వచ్చింది. ఇక ఈ అబ్బాయిని తీసుకెళ్ళండి. ఇంకెప్పుడూ ఈయన్ను ఇలా వెంటబెట్టుకుని సిరియా దేశానికి వెళ్ళకండి. బహుశా యూదులు ఇతనికి హాని తలపెట్టవచ్చు" అని హెచ్చరించాడు. ఆ తరువాత అబూతాలిబ్ కొందరు సేవకులను తోడు చేసి ముహమ్మద్ (ﷺ)ను మక్కాకు వాపసు పంపించారు.

## ఫుజ్జార్ పోరాటం

ముహమ్మద్ (ﷺ) 15వ ఏట ఖురైషీలకు ఇతర అరబ్బు తెగలకు మధ్య 'హర్బుల్ ఫుజ్జార్' (ఫుజ్జార్ పోరాటం) జరిగింది. పవిత్ర మాసాల్లో, పవిత్ర స్థలాల్లో కొన్ని అఘాయిత్యాలకు పాల్పడటం వల్ల ఈ పోరాటాన్ని హర్బుల్ ఫుజ్జార్ (వాటి పవిత్రతను విచ్ఛిన్నపరచిన పోరు)గా నామకరణం చేశారు. ఖురైష్ పక్షాన న్యాయం ఉండటం మూలాన ప్రవక్త (ﷺ) కూడా ఈ యుద్ధంలో పాల్గొన్నారు. బాణాలను సేకరించి తన చిన్నాన్న, పెదనాన్నలకు అందించటం ఆయన పని.

## ఫుజూల్ ఒప్పందం (హిల్ఫుల్ ఫుజూల్)

ఈ యుద్ధానంతరం 'హిల్ఫుల్ ఫుజూల్' జరిగింది. ఖురైష్ వంశానికి చెందిన బనూ హాషిమ్, బనూ అసద్, బనూ జుహ్రా మొదలగు తెగలవారు ఈ సందర్భంగా ఏక మయ్యారు. "మక్కాలో ఎక్కడైనా, ఎవ్వరైనా బాధించబడితే మేము అతన్ని ఆదుకుంటాము. అతనికి చెందాల్సిన హక్కుని అతనికి ఇప్పిస్తాము" అని వారంతా ప్రతిజ్ఞ చేశారు. ఈ ఒప్పందంలో ప్రవక్త (ﷺ) కూడా పాల్గొన్నారు. అల్లాహ్ తనకు దైవ దౌత్య సౌభాగ్యాన్ని ప్రసాదించిన తర్వాత కూడా తరచూ ఇలా అభిప్రాయపడుతుండేవారు: **"నేను అబ్దుల్లాహ్ బిన్ జద్ఆన్ ఇంట్లో ఓ ఒప్పందంలో పాల్గొన్నాను. ఆ ఒప్పందానికి బదులు నాకు (మేలు జాతి) ఎర్ర ఒంటెల్ని బహూకరించినా నేను ఇష్టపడేవాణ్ణి కాను, ఇప్పుడయినా (ఇస్లాంలో కూడా) ఇలాంటి ఒప్పందం కోసం పిలిస్తే దానికి నేను సిద్ధమే".** అజ్ఞాన కాలపు అహంభావాన్ని ఖండించి, ఆశ్రిత పక్షపాతానికి, వర్గ దురభిమానానికి స్వస్తి పలకటం ఈ ఒప్పందం సారాంశం.

# సద్గుణ సంపన్నులు ముహమ్మద్ (ﷺ)

## హజ్రత్ ఖదీజా (ర) గారితో వివాహం

మహా ప్రవక్త (ﷺ) యౌవనంలో బనూ సాద్ వారి మేకల్ని కొన్ని ఖీరాత్‌లకి బదులుగా మేపేవారు. మహా ప్రవక్త (ﷺ) వారి సుశీలత, సౌజన్యతను గురించి తెలుసుకున్న హజ్రత్ ఖదీజా తన వర్తక సామగ్రిని సిరియాకు తీసుకు వెళ్ళవలసిందిగా కోరారు. మహా ప్రవక్త (ﷺ) అంగీకారం తెలుసుకున్న తర్వాత తన బానిస మైసరాను తోడుగా పంపారు. మహా ప్రవక్త (ﷺ) మక్కా పట్టణానికి తిరిగి వచ్చాక ఖదీజా (ర) గారు మునుపెన్నడూ చూడని అధిక లాభాన్ని, శుభాలను తన వర్తక సామగ్రిలో చూశారు. అలాగే తన బానిస 'మైసరా' కూడా వ్యాపారంలో ముహమ్మద్ (ﷺ) ప్రదర్శించిన నైపుణ్యం, తెలివి తేటలను గురించి, సత్యసంధత, నిజాయితీ తత్పరతల గురించి వివరించి చెప్పాడు. దాంతో మోడువారిన ఆమె జీవిత వృక్షం మళ్ళీ చిగురించటం మొదలెట్టింది. ఖురైష్ వంశంలోని గొప్పగొప్ప శ్రీమంతులు ఆమెకు వివాహ సందేశం పంపినా ఆమె నిరాకరించారు. కాని ఇప్పుడు ఆమె తన మనసులోని మాటను 'నఫీసా' అనే చెలికత్తెకు తెలియజేశారు. ఆమె ముహమ్మద్ (ﷺ) దగ్గరకు పోయి హజ్రత్ ఖదీజా (ర) గారిని మనువాడమని కోరింది.

ఆయన (ﷺ) తన చిన్నాన్న, పెదనాన్నలతో సంప్రదించి వివాహానికి అంగీకరించారు. అందరూ హజ్రత్ ఖదీజా (ర) గారి పిన తండ్రి దగ్గరకు పోయి పెళ్ళి సంబంధం కుదుర్చుకున్నారు. వివాహం నిరాడంబరంగా జరిగింది. ఈ శుభ సందర్భంగా ఆమె ఇరవై ఒంటెల్ని దానం చేశారు. అప్పుడు ఆమె వయసు 40 సంవత్సరాలు. ఆమె తన తెగలోని స్త్రీలందరిలో ధన పరంగానూ, వంశం రీత్యానూ, విజ్ఞతావివేచనల దృష్ట్యానూ ఎంతో ఉత్తమురాలు. మహా ప్రవక్త (ﷺ)ను వివాహ మాడిన మొట్టమొదటి పుణ్య స్త్రీ ఆమె. ఆమె బ్రతికున్నంత కాలం ఆయన (ﷺ) మరో స్త్రీని వివాహమాడలేదు. కుమారుడు ఇబ్రాహీమ్‌ను మినహాయించి మిగతా సంతాన మంతా ఆమె ద్వారా కలిగినవారే. ఆమె ద్వారా జన్మించిన కుమారుడు హజ్రత్ ఖాసిమ్. ఆ పేరుతోనే ప్రవక్త (ﷺ) 'అబుల్ ఖాసిమ్' (ఖాసిమ్ తండ్రి) అని పిలవబడే వారు. ఆ తర్వాత హజ్రత్ జైనబ్, రుఖయ్యా, ఉమ్మె కుల్సూమ్, ఫాతిమా (ర) అను కుమార్తెలు, అబ్దుల్లాహ్ అనే మరో అబ్బాయి జన్మించారు. ప్రవక్త (ﷺ) వారి మగ సంతానం బాల్యంలోనే కాలధర్మం చెందారు. కుమార్తెలు పెరిగి పెద్దవారయ్యారు.. ఇస్లాం స్వీకరించారు. హిజ్రత్ కూడా చేశారు. కాకపోతే హజ్రత్ ఫాతిమా (ర) గారు మినహా మిగతా వారందరూ ప్రవక్త (ﷺ) వారి జీవితకాలంలోనే తనువు చాలించారు. మహా ప్రవక్త (ﷺ) వారు మరణించిన 6 నెలలకు ఆమె కూడా ప్రవక్త (ﷺ)ను చేరు కున్నారు.

## కాబా నిర్మాణ సమయంలో జరిగిన సంఘటన

మహా ప్రవక్త (ﷺ) గారికి 35 సంవత్సరాలు నిండాయి. ఖురైషు ప్రజలంతా కలిసి 'కాబా' నిర్మాణ కార్యాన్ని మొదలు పెట్టారు. కట్టడం పల్లపు ప్రదేశంలో ఉండటం వల్ల నీటి ప్రవాహానికి గోడలు బీటలు వారాయి. ఖురైషీలంతా తల్లడిల్లిపోయారు. పాత కట్టడాన్ని కూలదోసి దాన్ని కొత్తగా నిర్మించసాగారు. వివిధ తెగలవారు కట్టడంలోని వేర్వేరు భాగాలను పంచుకున్నారు. కట్టడం హజ్రె అస్వద్ (నల్లరాయి) చోటుకు చేరుకోగానే, దాన్ని గోడలో ఎవరు అమర్చాలనే వ్యవహారంపై వివాదం తలెత్తింది. దానిపై పెద్ద రభసే జరిగింది. నాలుగు రాత్రులు గడిచినా వ్యవహారం ఓ కొలిక్కి రాలేదు. ఒకరింకొకరిపై కత్తులు దూసుకోవడానికి, కుత్తుకలు కోసుకోడానికి సిద్ధ మవగా, మక్కా నాయకుల్లోని ఓ వ్యక్తి 'రేపు ప్రొద్దున అందరికన్నా ముందు మస్జిద్ ద్వారం గుండా వచ్చే వ్యక్తిని న్యాయనిర్ణేతగా అంగీకరించండి' అని సలహా ఇచ్చాడు.

ఆ వచ్చే వ్యక్తి మహా ప్రవక్త (ﷺ) కావాలన్నది అల్లాహ్ అభీష్టం. ప్రవక్త (ﷺ) వారిని చూడగానే అందరూ హర్షధ్వానాలు చేశారు. "ఈయన అమీన్ (నిజాయితీపరుడు). ఈయన చెప్పే తీర్పు మాకందరికీ సమ్మతమే" అని అందరూ అభిప్రాయపడ్డారు. అప్పుడు ప్రవక్త (ﷺ) ఓ దుప్పటిని తెప్పించి, 'హజ్రె అస్వద్'ను తానే స్వయంగా ఆ దుప్పటి మధ్యలో పెట్టారు. అన్ని తెగల నాయకులనూ పిలిచి ఆ దుప్పటి కొనలను పట్టుకుని ఆ రాయి పెట్టవలసిన చోటుకి ఎత్తమన్నారు. అలా అందరూ కలిసి తీసుకొచ్చిన తర్వాత ప్రవక్త (ﷺ) తానే స్వయంగా ఆ రాయిని ఎత్తి దాని స్థానంలో అమర్చారు. ముహమ్మద్ (ﷺ) వారి ఈ సమయస్ఫూర్తికి, విజ్ఞతకు అందరూ ఆశ్చర్య చకితులయ్యారు.

## దైవ దౌత్యానికి పూర్వ స్థితి

అప్పుడు ప్రవక్త (ﷺ) ఓ దుప్పటిని తెప్పించి, 'హజ్రె అస్వద్'ను తానే స్వయంగా ఆ దుప్పటి మధ్యలో పెట్టారు. తెగనాయకులైన వారిని పిలిచి ఆ దుప్పటి కొనలను పట్టుకుని ఆ రాయి పెట్టవలసిన చోటుకి ఎత్తమన్నారు. అలా అందరూ కలిసి తీసుకొచ్చిన తర్వాత ప్రవక్త (ﷺ) తానే స్వయంగా ఆ రాయిని ఎత్తి దాని స్థానంలో అమర్చారు. ముహమ్మద్ (ﷺ) వారి ఈ సమయస్ఫూర్తికి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

సహజంగా సుభక్తాగ్రేసరుల్లో ఉండే సుగుణాలన్నీ ప్రవక్త (ﷺ)లో మూర్తీభవించాయి. ఆయన గొప్ప ఆలోచనాపరులు, దూర దృష్టి గలవారు. మహా గొప్ప స్థితప్రజ్ఞులు. ఆయన ఏకాగ్రతతో పూర్తి ఏకచిత్తంతో సృష్టి రహస్యాలను, ప్రజల

జీవన విధానాన్ని, పరిసర ప్రాంతాల్లో నివసించే తెగల స్థితిగతులను, సంస్కృతీ సభ్యతలను అధ్యయనం చేయడంలో ఎక్కువ సమయాన్ని గడిపేవారు. తన జాతి వారు చేపట్టే మంచి కార్యాల్లో పాల్గొనేవారు. చెడు విషయాల జోలికి పోయేవారు కాదు. ప్రవక్త (ﷺ) ఏ నాడూను మద్యం సేవించలేదు. మిథ్యా దైవాల ముందు బలిచ్చే జంతువుల మాంసాన్ని ముట్టుకోలేదు. విగ్రహాలకు సంబంధించిన ఉత్సవాల్లో పాల్గొనలేదు. లాత్, ఉజ్జా పేరున ఒట్టు వేయడాన్ని సహించేవారు కారు. ప్రాపంచిక భోగభాగ్యాలకు, ఐహిక తళుకుబెళుకులకు ఆయన ఆమడ దూరాన ఉండేవారు. ఆయన (ﷺ) ఇలా అన్నారు: “అనాగరికులు చేపట్టే కార్యాలకు నేను రెండు సార్లు తప్ప మరెప్పుడూ సంకల్పించలేదు. ఆ రెండు సందర్భాల్లోనూ (బాల్యంలో) అల్లాహ్ నన్ను వాటి నుండి కాపాడాడు. ఆ తర్వాత అల్లాహ్ నాకు దైవదౌత్య బాధ్యతను అనుగ్రహించేంత వరకు అలాంటి ఆలోచన నా మదిలో కలుగలేదు. మక్కా ఎగువ భాగంలో నాతోపాటు మేకలు మేపే బాలుడితో – “నువ్వు కాసేపు నా గొర్రెల్ని కని పెట్టుకుని ఉంటే నేను మక్కాలో ప్రవేశించి యువకులతో కలిసి ఆడుకోవాలను కుంటున్నాను” అని అన్నాను. అందుకు అతను సరేనన్నాడు. నేను బయలుదేరి మక్కాలోని తొలి నివాసానికి దగ్గరయి ఉంటాను అంతే, బాజాభజంత్రీల శబ్దం విన్పించింది. ఇక్కడ జరుగుతున్నదేమిటి? అని నేను ప్రశ్నించాను. ఫలానా వ్యక్తితో ఫలానా స్త్రీ వివాహం జరుగుతుంది అని సమాధానం వచ్చింది. నేను కూర్చోని వినసాగాను. కాని అల్లాహ్ ఆ చెడును నా చెవిన పడకుండా చేశాడు. నేను నిద్రలోకి జారుకున్నాను. సూర్యకిరణాల తాకిడితో మెలకువ వచ్చింది. లేచి నా తోటి బాలుడి వద్దకు చేరుకున్నాను. అతను ఏం జరిగిందని ప్రశ్నించాడు. జరిగిందంతా అతనికి తెలియజేశాను. ఆ తర్వాత రెండో రోజు రాత్రి కూడా అదే పునరావృతం అయింది.

ఖురైషు ప్రజలందరిలో ఉత్తమ నడవడిక, గొప్ప లక్షణాల వల్ల మహా ప్రవక్త (ﷺ) గారికి అశేష ఆదరణ, విశేష స్థానం లభించింది. ఆయన అందరికన్నా గొప్ప శీలవంతులు, మహా సత్యవంతులు, కార్యదక్షత గలవారు. ఆడిన మాట తప్పని వ్యక్తిత్వం ఆయనది. ఈ కారణంగానే జాతివారు ఆయన్ను ‘అమీన్, సాదిఖ్’ అని వేనోళ్లా కొనియాడారు. ఒక్క మాటలో చెప్పాలంటే సకల సద్గుణాలకు పత్యక్ష రూపం ప్రవక్త (ﷺ). విశ్వాసుల మాత హజ్రత్ ఖదీజా (ర.అ) ఇలా అభిప్రాయపడ్డారు: “ఆయన ఇతరుల బరువును మోసేవారు. ఆర్తులకు, అన్నార్తులకు, అనాథలకు, అభాగ్యులకు ఆపన్నహస్తమై ఆదుకునేవారు. బలహీనుల్ని, బడుగు వర్గాల ప్రజల్ని, దళితుల్ని, పీడిత జనుల్ని అక్కున చేర్చుకుని వారి అవసరాల్ని తీర్చేవారు. మంచి విషయాలలో ప్రతి ఒక్కరితోనూ సహకరించేవారు”.

## శుభోదయ కిరణాలు

**'చదువు నిన్ను సృష్టించిన నీ ప్రభువు పేరుతో! ఆయన మనిషిని కరడు గట్టిన రక్తంతో సృష్టించాడు. చదువు, నీ ప్రభువు ఎంతో దయాళువు. ఆయన కలము ద్వారా మనిషికి జ్ఞానబోధ చేశాడు. మనిషి ఎరుగని జ్ఞానాన్ని అతనికి ప్రసాదించాడు'.**

(అలఖ్: 1–5)

### హిరా గుహలో

మహా ప్రవక్త (ﷺ) గారి వయసు 40 సంవత్సరాలకు దగ్గరవుతుండగా అల్లాహ్ ఆయన కోసం ఏకాంతాన్ని ప్రియంగా చేశాడు. తరచూ ఆయన (ﷺ) సత్తు పిండి, నీళ్ళు తీసుకుని మక్కాకు రెండు మైళ్ళ దూరాన ఉన్న నూర్ పర్వతంపై గల హిరా గుహలోకి వెళ్ళేవారు. రమజాను మాసమంతా హిరా గుహలోనే ఆరాధన, అనుశీలనల్లో, సృష్టి రహస్యాల ఛేదనలో నిమగ్ను లయ్యేవారు. నిత్యం తన జాతి వారిలో తిష్ఠ వేసిన విగ్రహారాధన, మద్యపాన సేవనం, విషయ లోలత్వం లాంటి సామాజిక రుగ్మతల గురించి, వారి నైతిక దుస్థితి గురించి తీవ్రంగా మథన పడేవారు. ప్రవక్త (ﷺ) గారి ఏకాంతం కూడా అల్లాహ్ సూచనల్లోని ఒక సూచనే. దైవదౌత్యానికి మూడు సంవత్సరాల ముందు నుండే అల్లాహ్ తన ప్రవక్త (ﷺ) కోసం ఈ ఏకాంతాన్ని సమ్మతించాడు. ప్రవక్త (ﷺ) ఈ ఏకాంతంలోనే నెలలు గడిపేవారు. బ్రహ్మాండమైన ఈ విశ్వ కర్మాగారం వెనుక ఉన్న ఆ శక్తి ఏది? మానవుల ఆ నిజ స్వామిని ఆరాధించే సరైన పద్ధతి ఏమిటి? వీటిపైనే ఆయన తన మనసును కేంద్రీకరించారు. దైవేచ్ఛతో చివరికి ఆ ఘడియ రానే వచ్చింది.

### జిబ్రయీల్ దైవ వాణి తీసుకొస్తున్నారు

దైవ ప్రవక్త (ﷺ) గారికి 40 యేండ్లు నిండాయి. అప్పుడు దైవ దౌత్య సూచనలు ప్రస్ఫుటమవసాగాయి. దివ్య కాంతులు విరజిమ్మసాగాయి. ఆ సూచనలు ఆయన (ﷺ) గారి కలలు. ఆయన చూసే ప్రతి కల ప్రభాకరుని లేకిరణంలా నిజమయ్యేది. ఈ పరిస్థితి ఆరు నెలల వరకు కొనసాగింది. ఈ కల దైవ దౌత్యపు నలభై భాగాల్లోని ఒక భాగం. అది రమజాన్ మాసం. ఎప్పటిలాగే ఆయన (ﷺ) దైవ ధ్యానంలో లీనమై ఉన్నారు. హిరా గుహలో ఆయన ఏకాంతవాసపు మూడవ సంవత్సరం అది. దైవ దూత జిబ్రయీల్ (عليه السلام) దైవ వాణికి సంబంధించిన కొన్ని దైవ వచనాలను తీసుకొచ్చారు.

అధిక శాతం పండితుల వ్యాఖ్యానం రీత్యా ఖుర్ఆన్ అవతరణ రమజాను మాసం 21వ తేదీన జరిగింది. హిరాలో ప్రవక్త (ﷺ) ముందు ప్రత్యక్షమైన హజ్రత్ జిబ్రయీల్ 'చదువు' అన్నారు. దానికి ఆయన 'నేను చదువుకోలేదు' అని సమాధానం ఇచ్చారు. (గట్టిగా అదిమి వదిలి) మళ్ళీ 'చదువు' అని పురమాయించారు. ఆయన మళ్ళీ 'నేను చదవలేను' అని పలికారు. మళ్ళీ జిబ్రయీల్ (عليه السلام) ఆయన్ని గట్టిగా అదిమి వదులుతూ 'చదువు' అని కోరారు. 'నేను చదువుకున్నవాణ్ణి కాను' అని తిరిగి బదులిచ్చారు.

మూడవసారి కూడా జిబ్రయీల్ (عليه السلام) అదిమి వదిలి ఇలా అన్నారు: **'చదువు నిన్ను సృష్టించిన నీ ప్రభువు పేరుతో! ఆయన మనిషిని కరడు గట్టిన రక్తంతో సృష్టించాడు. చదువు, నీ ప్రభువు ఎంతో దయాళువు. ఆయన కలము ద్వారా మనిషికి జ్ఞానబోధ చేశాడు. మనిషి ఎరుగని జ్ఞానాన్ని అతనికి ప్రసాదించాడు'.** (అలఖ్: 1–5)

ఈ సంఘటన జరిగిన వెంటనే మహా ప్రవక్త (ﷺ) భయాందోళనలతో వణుకుతూ హజ్రత్ ఖదీజా (ర.అ) వద్దకు వచ్చి **'దుప్పటి కప్పు, దుప్పటి కప్పు' అని అన్నారు.** కాస్త శాంతించిన మీదట ఆయన జరిగిందంతా హజ్రత్ ఖదీజా (ర.అ)కు వివరించారు. దానికి హజ్రత్ ఖదీజా (ర.అ) ఇలా ఓదార్చారు: **"అల్లాహ్ ఎట్టి పరిస్థితిలోనూ మిమ్మల్ని వృథా కానివ్వడు. ఎందుకంటే మీరు బంధువుల పట్ల బాధ్యతా నిర్వహణలో ఎలాంటి లోటు రానివ్వరు. ఇతరుల భారాన్ని తమరే మోస్తారు. ఆర్తులను, అనాథలను ఆదుకుంటూ ఉంటారు. అతిథులకు ఉచిత రీతిలో మర్యాద చేస్తారు. ఆపదల్లో ఉన్నవారికి (న్యాయప్రాప్తి కొరకు) తోడ్పడతారు".**

ఆ తర్వాత ఆయన్ని తీసుకొని ఆమె తన పెదనాన్న కుమారుడైన వరఖా బిన్ నౌఫిల్ దగ్గరకు వెళ్లారు. ఆయన వయసు పైబడిన పండు ముదుసలి. క్రైస్తవ మతస్తుడు. మహా ప్రవక్త (ﷺ) జరిగిన వృత్తాంతం అంతా వివరించగా, ఆ అద్భుత శక్తి ఎవరో కాదు, ప్రవక్త (عليه السلام)పై అవతరించిన దైవదూతే. ఇప్పుడు నేను పసి బాలుడ్ని అయి ఉంటే ఎంత బావుండేది. మీ జాతి వారు మిమ్మల్ని బహిష్కరించే రోజు నేను సజీవంగా ఉంటే ఎంత బాగుండు అని విచారం వ్యక్తం చేశాడు. **'ఏమిటి? నా జాతి వారు నన్ను బహిష్క రిస్తారా?'** అని ఆశ్చర్యంగా అడిగారు మహా ప్రవక్త (ﷺ). అవును, మీకు లభించిన ఇటువంటి సందేశాన్ని పొంది, దాన్ని ప్రజలకు అందజేసిన వారందరి పట్లా ప్రజలు వైరంతోనే మసిలారు. మీకు ఆ పరిస్థితులు ఎదురయ్యే వరకు నేను గనక జీవించి ఉంటే మీకు అండగా ఉంటాను అని సమాధానమిచ్చాడు వరఖా. కాని ఇది జరిగిన కొద్ది రోజులకే ఆయన మరణించాడు.

ఆ తర్వాత కొన్ని దినాల వరకు మహా ప్రవక్త ముహమ్మద్ (ﷺ)పై దివ్యావిష్కృతి అవతరించడం ఆగిపోయింది. అలా చాలా రోజులే గడిచాయి. ప్రవక్త (ﷺ) ఉదాసీనత క్రమ్ముకుంది. వహీ అవతరణకై ఎంతో ఆత్రుతతో ఎదురు చూడసాగారాయన. ఆ తర్వాత కొంత కాలానికి దైవవాణి అవతరించింది. దివ్యావిష్కృతి అవతరించే విధానాలు ఈ రీతిలో ఉండేవి:

1) ప్రవక్త (ﷺ) గారిపై దివ్యావిష్కృతి తొలి దశలో నిజమైన కల రూపంలో వచ్చేది.

2) ప్రవక్త (ﷺ)పై దివ్యావిష్కృతి (వహీ) అవతరించేటప్పుడు గంట మ్రోగుతున్న శబ్దం విన్పించేది. దాని ధాటికి ప్రవక్త (ﷺ) నుదుటిపై విపరీతంగా చెమటలు పట్టేవి. ఎముకలు కొరికే చలిలో సయితం అలాగే జరిగేది. ముఖ్యంగా జిబ్రయీల్ (అ) వచ్చేటప్పుడు ఈ పరిస్థితి ఏర్పడేది.

3) ఒక్కోసారి ప్రవక్త (ﷺ) ఎదుట దైవదూత మానవాకారంలో ప్రత్యక్షమై సంబోధించే వాడు. మానవాకారంలో ఉన్న దైవదూతను ప్రవక్త (ﷺ) వారి సహచరులు సయితం చూసేవారు.

దివ్యావిష్కృతి అవతరణ 23 సంవత్సరాల వరకు సాగింది. ప్రవక్త (ﷺ) 40వ ఏట నుండి ప్రారంభమై 63వ సంవత్సరం ఆయన మరణించేంత వరకూ అవతరిస్తూనే ఉంది. దైవ ప్రవక్త (ﷺ)పై అవతరించిన తొలి ఖుర్ఆన్ వచనాలు దాసుల నుండి కోరేదేమిటంటే – వారు స్వచ్ఛమైన ఏకేశ్వరోపాసన చేయాలి. తమ కార్యకలాపా లన్నింటినీ అల్లాహ్‌కు ప్రత్యేకించుకోవాలి. మనోవాంఛలను అల్లాహ్ ప్రసన్నత కోసం పరిత్యజించాలి అన్నది.

## సందేశ సారాంశం

అ) ఏకేశ్వరోపాసన (తౌహీద్)
ఆ) దైవదౌత్యం (రిసాలత్)
ఇ) పరలోక జీవితం (ఆఖిరత్)పై విశ్వాసం
ఈ) పతనానికి గురి చేసే అనైతిక చర్యల నుండి, అసభ్య ప్రహేళికల నుండి మాన వాత్మలను ప్రక్షాళనం చేయడం.
ఉ) సమస్త విషయాలను అల్లాహ్‌కు అప్పగించడం.

## సందేశ దశలు, ఘట్టాలు

దైవ ప్రవక్త (స) గారి ధర్మ ప్రచార కాలాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చు. 1) మక్కా జీవితం: దాదాపు 13 సంవత్సరాలు 2) మదీనా జీవితం: 10 సంవత్సరాలు. ఆ తర్వాత ప్రతి కాలం అనేక ఘట్టాలుగా విభజితమౌతుంది. అందులో ప్రతి మలుపు కు ఓ ప్రత్యేకత ఉంది. ఆ విధంగా మక్కా జీవితాన్ని మూడు దశలుగా విభజించ వచ్చు–

1) రహస్య సందేశ ప్రచారం – దాదాపు మూడు సంవత్సరాలు.
2) మక్కా లోపల బహిరంగంగా ప్రచారం – నబవీ శకం నాల్గవ సంవత్సరం మొదలు పదవ సంవత్సరం చివరి వరకు.
3) మక్కా వెలుపల సందేశ ప్రచారం – నబవీ శకం 10వ సంవత్సరం చివరి నుండి ప్రవక్త (ﷺ) మదీనాకు వలస వెళ్ళేవరకు.

## తొలి దశ - రహస్య సందేశ ప్రచారం

సహజంగా దైవప్రవక్త (ﷺ) ఇస్లాం సందేశాన్ని ముందు తన ఇంటివారికి, స్నేహితులకి అందజేయాలి. అందుకే వారందరినీ ఇస్లాం వైపు ఆహ్వానించారు. మొట్ట మొదట ఇస్లాం స్వీకరించిన వారిలో ఆయన (ﷺ) గురించి బాగా తెలిసిన సహధర్మచారిణి హజ్రత్ ఖదీజా (ర.అ). ఆయన బానిస జైద్ బిన్ హారిసా (ర). మరియు పెదనాన్న కొడుకు హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (ర). అప్పుడు అలీ గారి వయస్సు 10 సంవత్సరాలు. ఆయన ప్రవక్త (ﷺ) గారి సంరక్షణలోనే పెరిగారు. అదే విధంగా ప్రవక్త (ﷺ) గారి ఆప్తమిత్రుడైన హజ్రత్ అబూబకర్ (ర) కూడా ఇస్లాం స్వీకరించారు. ఆయన కూడా ధర్మ ప్రచారం ప్రారంభించారు. అబూ బకర్ (ర) గారికి మంచి పేరు ప్రఖ్యాతులుండేవి. ఆయన నడవడిక సయితం ఎంతో ఉత్తమ మైనది. ఆయన ప్రోద్బలం, ఉపదేశాల వల్ల 'ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్, సాద్ బిన్ అబీ వఖాస్, జుబైర్ బిన్ అవ్వామ్, అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్, తల్హా బిన్ ఉబైదుల్లాహ్ (రజియల్లాహు అన్హుం)లు ముస్లిములయ్యారు. ఈ ఎనిమిది మంది ఇస్లాం ప్రారంభం లోనే చేతికి అందిన ఆణి ముత్యాలు. అలాగే హజ్రత్ బిలాల్ బిన్ రిబాహ్, అర్ఖమ్ బిన్ అర్కమ్, ఖబ్బాబ్ ఇబ్నుల్ అరత్ కూడా ఇస్లాం మాధుర్యాన్ని ఆస్వాదించారు. ఆ తర్వాత ముస్లింల సంఖ్య పెరగసాగింది. కాకపోతే బలాన్ని పుంజుకోలేదు.

వారందరూ గుట్టుగానే ఇస్లాం స్వీకరించారు. వీరందరిని తీసుకుని మహా ప్రవక్త (ﷺ) 'దారుల్ అర్ఖమ్' (అర్ఖమ్ నివాసం)లో సమావేశమయి, రహస్యంగా ధర్మం గురించి బోధించేవారు. దైవ వాణి అవతరణ కొనసాగుతూనే ఉంది. ఈ కాలంలో అవతరించిన ఖుర్ఆన్ భాగాలు సందేశపు తొలి దశకు అనువుగా చిన్న చిన్న వాక్యాలతో, ఆత్మల్ని తట్టి లేపేవిగా, శుద్ధపర్చేవిగా ప్రాపంచిక వ్యామోహానికి దూరంగా ఉంచేవిగా ఉండేవి. స్వర్గ – నరకాలను అభివర్ణించే ఆయతులు కూడా ఉండేవి. ఇస్లాం ప్రారంభంలో 'ఇష్రాక్ రెండు రకాతులు (సూర్యోదయం తర్వాత) మరియు సంధ్యాకాలపు రెండు రకాతుల (సూర్యాస్తమయ వేళలో) నమాజును అల్లాహ్ విధిగా నిర్ణయించాడు.

## రెండవ దశ - బాహాటంగా ప్రచారం

**"నీ దగ్గరి బంధుమిత్రుల్ని భయపెట్టు"** అన్న ఆదేశం ఈ దశలో అవతరించింది. అప్పుడు ప్రవక్త (ﷺ) తన జాతివారిని అల్లాహ్ వైపు ఆహ్వానించారు. అందులో తొలుత ప్రవక్త (ﷺ) బనూ హాషిమ్‌ను పిలిచారు. వారు తమ వారైన బనూ అబ్దుల్ ముత్తలిబ్, బనూ అబ్దుల్ మునాఫ్‌తో హాజరయ్యారు. ఆ తర్వాత ప్రవక్త (ﷺ) వారంద రినీ ఏకదైవారాధన వైపు పిలిచారు. అల్లాహ్‌కు సహవర్తుల్ని కల్పించరాదని నచ్చ జెప్పారు. తాను అల్లాహ్ ప్రవక్తనని, మిమ్మల్ని మీరు నరకాగ్ని నుండి కాపాడు కోండని హితోపదేశం చేశారు. అప్పుడు పెదనాన్న అబూ తాలిబ్ "నీకు ఆజ్ఞాపించ బడిన దానిని నీవు చేస్తూ ఉండు, అయితే అబ్దుల్ ముత్తలిబ్ (తాతముత్తాతల నాటి) సాంప్రదాయక మతం వదలి పెట్టాలంటే ఎందుకో నా మనసు ఒప్పుకోవడం లేదు. నీవు మాత్రం నిస్సంకోచంగా దీన్ని అనుసరించవచ్చు. దైవసాక్షి! నేను బ్రతికున్నంత కాలం నీకు అండగా నిలుస్తాను" అన్నారు. అయితే అబూ లహబ్ మాత్రం ప్రవక్త (ﷺ) గారి మాటలు విని మండిపడ్డాడు. 'ఈ రోజంతా నీపై శాపం కలుగు గాక! దీని కోసమేనా మమ్మల్ని సమావేశపర్చావు?' అని అమర్యాదకరంగా ప్రవర్తించాడు. తత్కారణంగానే 'అబూ లహబ్ చేతులు విరిగిపోయాయి! అతడు సర్వ నాశనం అయిపోయాడు' అన్న దైవ సూక్తులతో సూరయె మసద్ అవతరించింది.

## సత్య ప్రకటన, బహుదైవారాధకుల వ్యతిరేకత

**"నీకు ఆదేశిస్తున్న విషయాన్ని ఎలాంటి దాపరికం లేకుండా ప్రజలకు చేరవేయి. బహుదైవారాధకులను ఏ మాత్రం ఖాతరు చేయకు".** (నహల్: 94) అన్న దైవాజ్ఞ వచ్చేంతవరకు ప్రచార పిలుపు గుట్టుగానే సాగింది. ప్రవక్త ముహమ్మద్ (ﷺ) సందే శాన్ని బాహాటంగా ప్రకటించడానికి సన్నద్ధులయ్యారు. విగ్రహాలను, బహు దైవారా ధనను తప్పు పట్టారు. విగ్రహాల యొక్క నిస్సహాయతను ఎండగట్టారు. అవి ఏ విధమైనటువంటి లాభం గాని, నష్టంగాని చేకూర్చలేవని స్పష్టపర్చారు.

# పురి విప్పిన పౌరుషం

**అబూ లహబ్ భార్య – ఉమ్మె జమీల్ అదే పనిగా ముళ్ళు తీసుకొచ్చి ప్రవక్త ముహమ్మద్ (ﷺ) నడిచే మార్గంలో (రాత్రిలో) పడేసేది. అబూ ముయీత్ కుమారుడు 'ఉత్బా' కూడా ఒకడు. ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారు సజ్దాలో ఉండగా ఒంటె ప్రేవుల్ని వీపుపై పడేసేవాడు. అలాగే ఖురైష్ నాయకుల్లో ప్రముఖుడైన 'అబూ జహల్' కూడా ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారు సజ్దాలో ఉన్న సమయంలో మెడలో త్రాడు వేసి బిగించేవాడు.**

ఈ సంఘటన తర్వాత మక్కా ప్రజల కోపతాపాలు, క్రోధావేశాలు కట్టలు తెంచుకున్నాయి. తమ పూర్వీకుల సంప్రదాయాలపై వచ్చి పడిన ఈ కొత్త ప్రమాదాన్ని సమూలంగా పెకలించివేయాలని ఖురైషులు సంకల్పించారు. వారికి బాగా తెలుసు, అల్లాహ్‌ను విశ్వసించడమంటే – ఆయన్ను మినహా తక్కిన మిథ్యాదైవాలన్నింటినీ త్రోసి పుచ్చాలని. అలాగే ఈ వినూత్న సందేశం గనక ప్రబలినట్లయితే మక్కా వారికి అరబ్బులపై మతాధిక్యత క్రమంగా క్షీణించిపోతుంది. అదే విధంగా ఈ సందేశ స్వీకారం వల్ల ఉదయం సాయంత్రం వారు పాల్పడే అఘాయిత్యాలపై, అనైతిక చర్యలపై, అసభ్య ప్రహేళికలపై వేటు పడుతుందని కూడా పసిగట్టారు. అయితే ఇప్పుడేం చేయాలో వారికి తోచడం లేదు. చివరికి గత్యంతరంలేక ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారి పెదనాన్న అబూ తాలిబ్ దగ్గరకు వెళ్లాలని నిర్ణయించారు. 'మీ తమ్ముడి కొడుకు చేసే ప్రచారాన్ని ఆప'మని కోరారు. అలాగే తమ దేవతలను పూజించవద్దని ప్రజలకు చెప్పడం మానుకోమని అతనికి నచ్చజెప్పాలి అని కోరారు. పరిస్థితి విషమిస్తున్న సంగతి గ్రహించిన అబూ తాలిబ్ వారిని మంచి మాటలతో సాగనంపారు. ఇటు ప్రవక్త ముహమ్మద్ (ﷺ) సత్యాన్ని బాహాటంగా ప్రకటిస్తూ, అల్లాహ్ వైపు ప్రజల్ని ఆహ్వానిస్తూ ముందుకు సాగిపోతున్నారు.

ప్రవక్త ముహమ్మద్ (ﷺ) సందేశ ప్రచారంలో మున్ముందు సాగిపోతున్నారన్న విషయాన్ని ఖురైష్ ప్రజలు గ్రహించారు. అందులోనూ హజ్ దినాలు దగ్గరవుతున్నాయి. ఈయన్ను ప్రలోభ పెట్టిగానీ, బలవంతం చేసిగాని లొంగదీసుకోలేమని వారికి తెలుసు. ఈ సందేశ జ్యోతిని ఆర్పివేయటానికి కొన్ని కొత్త పద్ధతుల్ని ఎంచుకున్నారు. ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారికి పిచ్చి పట్టిందని ఓసారి, తాంత్రికుడని ఓసారి, తండ్రి–కొడుకుల్ని, భార్యాభర్తల్ని విడదీసేవాడని, ఇలా అనేక విధాల దుష్ప్రచారం చేయసాగారు. (అలాగే ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు) ప్రవక్త ముహమ్మద్ (ﷺ)ను

అగౌరవ పరచడం, అవమాన పర్చడం, అవహేళన చేయడం, వ్యతిరేకించడం వంటి నీచ చర్యలకు పాల్పడ్డారు. ఈ వెకిలి చేష్టల ద్వారా ముస్లింలను అప్రతిష్ఠ పాల్జేసి వారి శక్తిని బలహీనపర్చాలన్నది వారి అభిమతం. అంతే కాకుండా ఇస్లాం ప్రబోధ నల్ని అనుమానాస్పదంగా చిత్రీకరించి, అబద్ధాలని నమ్మించే ప్రయత్నం కూడా చేశారు. చివరికి గత్యతరంలేక కాస్త మెత్తబడి... 'ఓ సంవత్సరం మీరు మా దేవతల్ని పూజించండి, ఓ సంవత్సరం మేము మీ దేవుణ్ణి పూజిస్తాం' అన్న ప్రతిపాదనను ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారి ముందు పెట్టారు. అప్పుడే సూరయె కాఫిరూన్ (మీరు పూజించే వాటిని నేను పూజించను) అవతరించింది.

సత్యధర్మ ప్రచారాన్ని శతవిధాలా ప్రయత్నించినా అడ్డుకోలేకపోయామన్న విషయాన్ని గ్రహించిన బహుదైవారాధకులందరూ కలిసి మరో ఎత్తుగడ వేశారు. ఇస్లాంను ప్రతిఘటించాలని, ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారిని మనోవేదనకు గురి చేయాలని, ఇస్లాంని ఆశ్రయించేవారిని, ముఖ్యంగా వారిలోని బలహీనుల్ని, బానిసల్ని హింసించాలని వారందరూ కూడబలుక్కున్నారు.

మహా ప్రవక్త ముహమ్మద్ (ﷺ) వారిని మనో వేదనకి గురి చేసిన తొలి వ్యక్తి అబూ లహబ్. మొట్టమొదట అతను పాల్పడిన దుష్చర్య – ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారి కుమార్తెలు రుఖయ్యా మరియు ఉమ్మె కుల్సూమ్ (ర)కు విడాకులివ్వమని తన ఇద్దరు కొడుకుల్ని ఉసిగొల్పటం. అతను ప్రవక్త (ﷺ)పై రాళ్లు రువ్వేవాడు. ఆయన పాదాలు రక్తసిక్తమయ్యేవి. అబూ లహబ్ భార్య – ఉమ్మె జమీల్ అదే పనిగా ముళ్ళు తీసుకొచ్చి ప్రవక్త ముహమ్మద్ (ﷺ) నడిచే మార్గంలో (రాత్రి పూట) పడేసేది.

బహుదైవారాధకుల్లో ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారిని బాధ పెట్టినవారిలో అబూ ముయీత్ కుమారుడు 'ఉత్బా' కూడా ఒకడు. ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారు సజ్దాలో ఉండగా ఒంటె ప్రేవుల్ని వీపుపై పడేసేవాడు. అలాగే ఖురైష్ నాయకుల్లో ప్రముఖుడైన 'అబూ జహల్' కూడా ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారు సజ్దాలో ఉన్న సమయంలో మెడలో త్రాడు వేసి బిగించేవాడు.

ఇటు ముస్లింలు కూడా బహుదైవారాధకులు పెట్టే బాధలకు గురవుతూనే ఉన్నారు. ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (ర) గారి పెదనాన్న ఆయన్ను సాపలో చుట్టి క్రింద నుండి పొగ వేసేవాడు. ఇక ముస్అబ్ బిన్ ఉమైర్ విషయమంటారా! తను ఇస్లాం స్వీకరించా డన్న వార్త విన్న అతని తల్లి అన్నం పెట్టకుండా ఇంటి నుండి గెంటేసింది. (ఇస్లాంకు పూర్వం) ఆయన గొప్ప శ్రీమంతులు. బిలాల్ (ర) గారి పరిస్థితి మరీ దయనీయం.

ఆయన ఉమయ్యా బిన్ ఖలఫ్ దగ్గర బానిస. ఉమయ్య ఆయన గారి మెడలో త్రాడు వేసి 'వీడ్ని మక్కా పర్వత లోయల గుండా ఈడుస్తూ తిరగండి' అని అల్లరి మూకలకు అప్పగించేవాడు. అలాగే మండుటెండల్లో కూర్చోబెట్టి కొరడాతో ఒళ్ళు హూనం చేసేవాడు. అలా ఓ రోజు యథావిధిగా చిత్రహింసలు పెడుతుండగా హజ్రత్ అబూ బకర్ (ర) అటు నుంచి వెళుతూ చూశారు. (ఆ అమానుషానికి చలించిపోయి) ఆయన్ను కొని బానిసత్వం నుండి విముక్తిని ప్రసాదించారు.

ఇక అమ్మార్ బిన్ యాసిర్ విషయానికొస్తే, అబూ జహల్ ఆయన్ను, ఆయన తల్లిదండ్రుల్ని ఎడారి వైపుకు తీసుకెళ్ళేవాడు. మిట్ట మధ్యాహ్నపు మండుటెండల్లో ఇసుక నేల మీద పడేసి కొరడాతో ఒళ్లు హూనం చేసేవాడు. నానా రకాలుగా చిత్ర హింసలు పెట్టేవాడు. ప్రవక్త ముహమ్మద్ (ﷺ) వారి బాధను చూసి – "ఓ యాసిర్ కుటుంబీకుల్లారా! ఓర్పు వహించండి. నిశ్చయంగా మీ శాశ్వత నివాసం స్వర్గ ధామమే" అని ఓదార్చేవారు. ఆ దుర్మార్గుడు పెట్టే చిత్రహింసకు తాళలేక మృతి చెందారు యాసిర్ (ర). ఇస్లాం మార్గంలో చిందించబడిన మొదటి రక్తం ఆయనదే. అబూ జహల్ దుష్టుడు ఈటెతో అమ్మార్ తల్లి సుమయ్యా (ర) గారిపై విసిరాడు. ఆ దెబ్బకు ఆమె నేలకొరిగారు. అలా ఇస్లాంలో వీరమరణం (షహాదత్) పొందిన తొలి మహిళామూర్తిగా ఆమె తన స్థానాన్ని పదిల పర్చుకున్నారు.

## హబ్షా (అబిసీనియా)కు వలస (హిజ్రత్)

ఇక ఈ హింసా కాండకు అంతమంటూ ఉండదని గ్రహించిన కొందరు ముస్లింలకు అబిసీనియా వెళ్ళాలన్న ఆలోచన వచ్చింది. తమ విశ్వాసాన్ని, ధర్మాన్ని కాపాడు కుంటూ ఈ విగ్రహారాధనా వర్గానికి ముఖ్యంగా వారు పెట్టే హింసలకి అతి దూరంగా వెళ్ళిపోవాలని సంకల్పించుకున్నారు. హబ్షా (నేటి ఇథియోపియా) పాలకుడు చాలా మంచి మనసు కలవాడని, సత్య ప్రియుడని వారికి బాగా తెలుసు. ఈ వలస ప్రయాణం సందేశ ప్రచార ఐదవ సంవత్సరంలో జరిగింది. వలసపోయిన వారు (రెండు ప్రయాణాల్లోను) మొత్తం 83 మంది పురుషులు, 18 మంది స్త్రీలు. ఈ సంఘటన వల్ల బహుదైవారాధకులకు అంతులేని అగాధం ఏర్పడింది. పట్టరాని కోపం వచ్చింది. వలస వెళ్ళిన విశ్వాసులు ప్రశాంతంగా జీవించడంగానీ, తాము నమ్ముకున్న ధర్మాన్ని స్వేచ్ఛగా అనుసరించడంగానీ వారికి బొత్తిగా ఇష్టం లేదు. కనుక ఎలాగైనా వారిని వెనక్కి రప్పించాలని వ్యూహరచన చేశారు. ఈ కార్య నిర్వ హణకై ఖురైషుల్లోని ఇద్దరిని ఎన్నుకున్నారు. వారి ద్వారా నజాషీ కోసం గొప్ప గొప్ప

బహుమతులు కూడా ఇచ్చి పంపారు. వారిద్దరూ అక్కడికి చేరుకుని 'ఇక్కడ మీ దేశంలో కొందరు మూర్ఖులు వారి తాతముత్తాతల సంప్రదాయాలను విడిచి, ఓ కొత్త మతాన్ని స్థాపించుకున్నారు. మేముగానీ, మీరుగాని ఈ నూతన మతాన్ని ఎరుగము. అంచేత మా నాయకులు వీళ్ళను తీసుకురమ్మని మమ్మల్ని పంపారు' అని విజ్ఞప్తి చేసు కున్నారు.

నజాషీ రాజు నిలబడి 'తన జాతి వారిని వదలి ఇక్కడికి రావడానికి కారణమైన ఆ మతం ఏది?' అని అడిగాడు. సమాధానం ఇవ్వడానికి హజ్రత్ జాఫర్ బిన్ అబూ తాలిబ్ (ర) సిద్ధమయ్యారు. ఆయన ముస్లింల తరఫున మాట్లాడుతూ ఇలా చెప్ప నారంభించారు: "రాజా! మేము పూర్వం అజ్ఞానులుగా ఉండి, విగ్రహాలను పూజించే వాళ్లం. అశ్లీలతా ఊబిలో దిగబడి ఉండేవాళ్ళం. కామం, క్రోధం, మోహం, మదం, మత్సర్యం, మద్య సేవనం, మగువ లోలత్వం, దొంగతనం, దోపిడి లాంటి అవలక్ష ణాలకి ఆలవాలంగా ఉండేది మా సమాజం. ఇవి చాలవన్నట్లు బంధుత్వ సంబంధాల విచ్ఛితికి పాల్పడటం మా దినచర్యగా ఉండేది. అలాంటి తమో చీకట్లలో అల్లాహ్ మా మధ్య స్వయంగా మాలో నుండే తపో కిరణమైన ఓ ప్రవక్తను ప్రభవింప జేశాడు. మేము ఆయన గౌరవప్రదమైన వంశాన్ని, ఆయన సత్యసంధతను బాగా ఎరిగినవాళ్ళమే. 'మేమంతా అల్లాహ్ ఒక్కణ్ణే మనందరి పూజ్యనీయుడిగా ప్రభువుగా నమ్మాలని, విగ్రహారాధనను పరిత్యజించాలని, సదా సత్యమే పలకాలని, విశ్వసనీయతను అలవర్చుకోవాలని, బంధుత్వాన్ని పటిష్ట పరచుకోవాలని ఆయన ఉపదేశించారు. అలాగే అవలక్షణాలకు దూరంగా మసలుకోవాలనీ, అనాథల సొమ్మును అన్యాయంగా తినకూడదని హెచ్చరించారు. మేము ఆయన్ని సత్య ప్రవక్తగా విశ్వసించాము. ఆయన తెలిపిన ప్రతి విషయాన్నీ మనసారా స్వీకరించాము.

"అయితే ఈ కారణంగానే మా జాతి వారు ఆగ్రహించి మమ్మల్ని హింసించారు. తీవ్ర పరీక్షలకు గురిచేశారు. మేము సత్యధర్మాన్ని వదలి తిరిగి విగ్రహారాధన చేయాలని ఒత్తిడి తెచ్చి మా జీవితాలను దుర్భరం చేసారు. చివరకు మేము వారి దౌర్జన్యాలు, దౌష్ట్యాలు భరించలేక మీ దేశానికి మిమ్మల్ని నమ్మి వచ్చి తల దాచు కున్నాము. మీరు ఉండగా మాపై ఎటువంటి జులుం జరగకుండా చూస్తారని ఆశిస్తున్నాము" అని మాట పూర్తి చేశారు హజ్రత్ జాఫర్ (ర).

ఈ మాటలు విన్న నజాషీ – 'సరే ఆయనపై అవతరించిన దైవ వాణి మీ దగ్గర ఏమైనా ఉందా?' అని అడిగాడు. "అవును, ఉంది" అన్నారు జాఫర్ (ర). 'అయితే నా సమక్షంలో దాన్ని పఠించు' అన్నాడు. హజ్రత్ జాఫర్ (ర) 'మర్యం' అధ్యాయాన్ని

పఠించారు. అది విన్న నజాషీ రోమాంచితుడై కంట తడి పెట్టాడు. ఆయన గడ్డం తడిసి ముద్దయింది. పాదరీల కళ్ళు కూడా అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి. ఆ తరువాత నజాషీ ఇలా అభిప్రాయపడ్డాడు: 'దైవసాక్షి! ఈ వాణి, ప్రవక్త ఈసా (అ) తీసుకువచ్చిన వాణి రెండు ఒకే పరంజ్యోతి నుండి ఉద్భవించిన కిరణాలుగా గోచరిస్తున్నాయి'. ఆ తరువాత ఖురైషు ప్రతినిధుల వైపు తిరిగి 'దైవ సాక్షి! వీళ్ళను మీ వెంట పంపించే ప్రసక్తే లేదు. ఇక మీరు వచ్చిన దారి వెళ్ళిపోవచ్చు' అన్నాడు. ఆ దరిమిలా ముస్లింలతో – 'వెళ్ళండి మీరు నా రాజ్యంలో సురక్షితులై సంచరించండి' అని అభయమిచ్చాడు. దీంతో హబ్షా నుండి ముహాజిరీన్లను తిరిగి తీసుకు రావడానికి పన్నిన ముష్రికుల పన్నాగం మన్ను గరిచిపోయింది.

తాము రచించిన వ్యూహం బెడిసికొట్టిందని గ్రహించిన ముష్రిక్కులు, తమ నాయకులతో అబూ తాలిబ్ దగ్గరకు వెళ్ళి, 'మా పెద్దలను విమర్శించవద్దని, మా దేవతలను తప్పుపట్టవద్దని, మా కలల్ని వమ్ము చేయవద్దని నీ సోదరుడి కుమారుడ్ని కొంచెం మందలించు' అని కోరారు. అప్పుడు అబూ తాలిబ్, సోదరుడి కుమారుడ్ని పిలిపించి సత్యధర్మ ప్రచారాన్ని ఆపేయవలసిందిగా కోరారు. అందుకు మహనీయ ముహమ్మద్ (స) ఇలా బదులిచ్చారు: "పెదనాన్నా! అల్లాహ్ సాక్షిగా! వీరు నా కుడి చేతిలో సూర్యుడ్ని, ఎడమ చేతిలో చంద్రుడ్ని తెచ్చిపెట్టి ఈ మహా కార్యాన్ని మానుకోమన్నా అది జరిగే పని కాదు. ఈ కార్యమైనా నెరవేరాలి లేదా ఈ కార్యసిద్ధి కోసం నా ప్రాణమైనా పోవాలి". తను తలచింది నెరవేర్చడంలో ప్రవక్త (స) వజ్ర సంకల్పి అని గ్రహించిన ఖురైష్ ప్రజలు మరో ఎత్తుగడ వేశారు. వలీద్ బిన్ ముగీరా కొడుకు 'అమారా' అనే సుందరుడైన నవ యువకుడ్ని వెంటబెట్టుకుని అబూ తాలిబ్ దగ్గరకు పోయారు. అబూ తాలిబ్! అమారాను మీ కొడుకుగా మీ దగ్గర ఉంచుకోండి. ఇతనికి బదులు మీ సోదరుడి కుమారుడ్ని మాకు అప్పగించండి" అని ఉచిత సలహా ఇచ్చారు. అందుకు అబూ తాలిబ్ "దైవ సాక్షి! ఎంత అమానుషానికి పాల్పడుతున్నారు మీరు!? ఎంత వివక్షతో ప్రవర్తిస్తున్నారు మీరు! మీ వాడ్ని నా దగ్గర పెట్టుకున్ని ముప్పూటలా తిండి పెట్టాలా, మావాడ్ని నామరూపాల్లేకుండా హత మార్చేందుకు మీకు ముట్టజెప్పాలా?" అని కాస్త కటువుగానే గదమాయించారు.

## హజ్రత్ హమ్జా (ర) ఇస్లాం స్వీకారం

దౌర్జన్యపు, దుర్మార్గపు కర్రి మబ్బులు కమ్ముకున్న గాఢాంధకార తరుణంలో ఓ ఆశాకిరణం తళుక్కున మెరిసింది. అదే అబ్దుల్ ముత్తలిబ్ కుమారుడు హమ్జా గారి ఇస్లాం స్వీకరణ. ఈ సంఘటన నబవీ శకం 6వ సంవత్సరంలో జరిగింది. ఆయన

ధర్మస్వీకారానికి కారణం – ఓ రోజు అబూ జహల్ ప్రవక్త (ﷺ) వారిని దూషించాడు. రాయి తీసుకుని ఆయన తలపై కొట్టాడు, చివ్వుమని రక్తం చిమ్ముకొచ్చింది. ఆ తరువాత ఖురైషీ గుంపు దగ్గరకు వెళ్ళాడు. హ్రజత్ హమ్జా అప్పుడే వేట నుండి తిరిగి వచ్చారు. ఈ సంఘటనకు ప్రత్యక్ష సాక్షిగా ఉన్న ఒక స్త్రీ జరిగిన వృత్తాంతమంతా వినిపించింది. హమ్జా ఖురైషుల్లో గొప్ప ఠీవి, దర్పం గల యువకుడు. ఇది విన్న హమ్జా ఆగ్రహోదగ్రులయ్యారు. అదే క్రోధావేశంతో అబూ జహల్ వద్దకు వెళ్ళి "నా సోదరుని కొడుకుని తిడతావా? కొడతావా? ఎన్ని గుండెలు నీకు? నేను కూడా అతని మార్గంపైనే ఉన్నాను" అంటూ ధనస్సుతో అబు జహల్ శిరస్సు మీద బలంగా కొట్టారు. అబూ జహల్ తల పగిలి రక్తం కారసాగింది. చివరికి అల్లాహ్ ఆయన హృదయాన్ని ఇస్లాంకై విప్పారజేశాడు. ఆయన ఇస్లాం స్వీకారం ముస్లింలను ఎంతో ఉత్తేజ పర్చింది. ముహమ్మద్ (ﷺ) గారి పక్షాన నిలిచి ఆయన్ను సమర్థిస్తూ స్వీకరించిన ఇస్లాం మొదట హమ్జా గారిదే.

## హజ్రత్ ఉమర్ (رضي الله عنه) ధర్మ స్వీకారం

అన్యాయం, అక్రమాల మసక సంధ్యల్లో మరో మెరుపు మెరిసింది. అదే ఖత్తాబ్ పుత్రుడగు ఉమర్ గారి ధర్మ స్వీకారం. హ్రజత్ హమ్జా (رضي الله عنه) ఇస్లాం స్వీకరణ జరిగిన మూడు రోజుల అనంతరం ఈ సంఘటన జరిగింది. ఉమర్ ఇస్లాం స్వీకరించాలని దైవప్రవక్త (ﷺ) దుఆ చేస్తూ ఉండేవారు. హ్రజత్ ఉమర్ (رضي الله عنه) గొప్ప ధైర్యశాలి. ప్రతాప రుద్రుడు. ఆయన ధర్మ స్వీకారానికి కారణం – ఒకరోజు విరోధ తాపంతో కరవాలం చేబూని మహా ప్రవక్త (ﷺ)ను కడతేర్చే ఉద్దేశ్యంతో బయలుదేరారు. దారిలో ఓ వ్యక్తి ఎదురై 'ఉమర్! ఎక్కడికి బయలుదేరావు?' అని అడిగితే 'ముహమ్మద్(స)ను హతమార్చడానికి' అన్నారు. అందుకు ఆ వ్యక్తి నీకు దీనికన్నా ఆశ్చర్యకర విషయం తెలియజేయనా? స్వయంగా నీ చెల్లెలు, నీ బావగార్లే ఇస్లాం ఛత్రఛాయల్లోకి చేరి ఉన్నారు. నీవు నడుస్తున్న మార్గానికి వారు ఎప్పుడో స్వస్థి పలికారు' అన్నాడు. ఇది వినగానే ఆయన చెల్లెలింటికి వచ్చారు. అక్కడ వారిద్దరితో పాటు ఖబ్బాబ్ బిన్ అరత్ (رضي الله عنه) కూడా ఉన్నారు. ఆయన చేతిలో ఖుర్ఆన్ ప్రతులున్నాయి. ఆయన ఆ గ్రంథంలోని 'తాహా' అధ్యాయాన్ని చదువుతున్నారు. ఖబ్బాబ్ (رضي الله عنه) గారి పఠనాన్ని ఉమర్ విన్నారు. "ఇప్పుడు నేను విన్నదేమిటి? మీరిద్దరూ ఇస్లాం స్వీకరించారన్న మాట నిజమేనా?" అని గర్జించారు. ఆయన చెల్లెలు – 'ఉమర్! సత్యం నీ ఆచారంలో కాక మరోదాంట్లో ఉంటే నువ్వు ఏమంటావు"? అని నిర్మొహమాటంగా అనేసరికి ఉమర్ మరింత రెచ్చిపోయి చెల్లిపై విరుచుకుపడ్డారు. ఆమె తల నుండి రక్తం కారేంత వరకూ కొడుతూనే ఉన్నారు. తుదకు తన చెల్లి రక్తసిక్తమవడం

చూసి ఆయన కోపం చల్లారింది. సిగ్గు చెందారు. "సరే ఈ గ్రంథాన్ని నాకివ్వండి" అన్నారు. 'నువ్వు ముందు స్నానం చేసిరా' అంది చెల్లెలు. ఉమర్ (ﷺ) వెళ్ళి స్నానం చేసి వచ్చారు. ఆ తర్వాత ఖుర్ఆన్ తీసుకొని చదవనారంభించారు.

**"బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ త్వాహా**....అంటూ ప్రారంభించి, నిస్సందేహంగా నేనే అల్లాహ్‌ను (దేవుణ్ణి), నేను తప్ప మరొక దేవుడు లేడు. దాస్యం నాకే చేయండి. నన్నే ఆరాధించండి" అనే వచనం వరకు చేరాక అప్రయత్నంగా 'ఆహా! ఎంత మధురమైన పలుకులివి! ఎంత పవిత్రమైన వాణి ఇది!!' అన్నారు.

ఆ తర్వాత "నాకు ప్రవక్త (ﷺ) గారు ఎక్కడున్నారో తెలుపండి" అని కోరారు. ఆ పిదప కరవాలం పట్టుకొని, ప్రవక్త (ﷺ) తన సహచరులతో సమావేశమై ఉన్న చోటికి బయలుదేరారు. అక్కడికి వెళ్ళి ప్రవక్త (ﷺ)ను చూసిన మరుక్షణమే "అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదర్రసూలుల్లాహ్" అంటూ ఇస్లాం స్వీకరించారు. ఇంట్లో ఉన్న ప్రవక్త (ﷺ) గారి అనుయాయులు ఆనందాతిశయంతో 'అల్లాహ్ అక్బర్' అంటూ బిగ్గరగా నినదించారు.

## సంఘ బహిష్కరణ

మహా ప్రవక్త (ﷺ)ను హతమార్చాలన్న ప్రతిపాదనతో అబూ లహబ్ మినహా బంధువుల్లో ఎవరూ ఏకీభవించలేదు. బనూ అబ్దుల్ ముత్తలిబ్, బనూ హాషిమ్ వారైతే గట్టిగా అభ్యంతరం తెలిపారు. అందువల్ల విగ్రహారాధకులంతా కుమ్మక్కై వారిలోని ముస్లింలను, అభ్యంతరం తెలిపిన విగ్రహారాధకులను కూడా సంఘం నుండి బహిష్కరించాలని తీర్మానించారు. ప్రవక్త (ﷺ) గారిని హతమార్చడానికి వారు స్వయంగా మాకు అప్పగించనంత వరకూ వారితో ఎవరూ చుట్టరికం పెట్టుకోరాదు. వారితో పెళ్ళి పేరంటాల్లాంటివి పెట్టుకోరాదు. వారితో వ్యాపార లావాదేవీలు జరపరాదు. వారితో కలిసిమెలిసి కూర్చోరాదు. వారితో ఎటువంటి సంభాషణలు జరుపరాదు అన్న ఒప్పందం వ్రాసి కాబా గృహ మధ్య లోపలి భాగంలో వ్రేలాడ దీశారు. అంతటితో ఆగక, బనూ అబ్దుల్ ముత్తలిబ్, బనూ హాషిమ్ వంశీయులని 'షోబె అబూ తాలిబ్' అనే పర్వత లోయలో నిర్బంధించారు... ఎంతో కష్టభూయిష్ట మైన ఈ నిర్బంధం మూడేండ్లపాటు కొనసాగింది. చివరికి (ఆకలి బాధలను తట్టుకో లేక) వారు ఎండిపోయిన చెట్ల ఆకులను కూడా తినాల్సి వచ్చింది. వారి స్త్రీలు, పిల్లల ఆకలి బాధలతో కూడిన ఆక్రందనలు ఆ లోయ బయట వరకు విన్పించేవి... ఈ దయనీయ స్థితి ఆ ఒప్పందం చిరిగిపోయేంతవరకు – అంటే మూడు సంవత్సరాల వరకు కొనసాగింది. తర్వాత ఖురైషుల మధ్యనే ఈ ఒప్పందం గురించి ద్వంద్వాభి

దయనీయ స్థితి ఆ ఒప్పందం చిరిగిపోయేంతవరకు – అంటే మూడు సంవత్సరాల వరకు కొనసాగింది. తర్వాత ఖురైషుల మధ్యనే ఈ ఒప్పందం గురించి ద్వంద్వాభి ప్రాయాలు విన్పించాయి. “ఇది మరీ విపరీతం” అన్న అభిప్రాయం వారిలో ప్రబ లింది. ఈ ఒప్పందాన్ని నిరసించినవారు ఒప్పంద పత్రాన్ని చింపేయాలని ప్రయత్నిం చారు. విగ్రహారాధకుల్లోని ఓ వ్యక్తియే దాన్ని చింపేయాలని బయలు దేరాడు. అయితే అప్పటికే **“బిస్మికల్లాహుమ్మ”**ను మినహాయించి మిగతా ఒడంబడిక పత్రాన్నంతా చెదలు తినివేసింది. దీని తర్వాత ఒడంబడిక దానంతట అదే రద్దయిపోయింది. దైవప్రవక్త (స) మరియు ఆయనతో ఉన్నవారంతా స్వేచ్ఛాజీవులై ఆ లోయ నుండి బయట పడ్డారు. మూడేండ్ల ఆ దిగ్బంధం నుండి విముక్తి పొందారు.

## విషాద సంవత్సరం

**“ప్రజలు నన్ను వ్యతిరేకించినప్పుడు తను నన్ను విశ్వసించింది. ప్రజలు నన్ను తప్పు పట్టినప్పుడు తను మాత్రం నా మాట అక్షర సత్యమని ధృవీకరించింది. ప్రజలు నన్ను ఆర్థికంగా దివాలా తీయాలనుకున్నప్పుడు తను తన సొంత ఆస్తితో నన్నాదుకుంది. ఆమె ద్వారానే అల్లాహ్ నాకు సంతానాన్ని అనుగ్రహించాడు”.**

నబవీ 10వ సంవత్సరం దైవప్రవక్త (ﷺ) గారి పెత్తండ్రి అబూ తాలిబ్ వ్యాధిగ్రస్తులయి కోలుకోలేని పరిస్థితికి లోనయ్యారు. ఆయన కాలం సమీపించింది అని గ్రహించిన ప్రవక్త (ﷺ), ఆయన వద్దకు వెళ్లి, **‘మీరు కేవలం “లా ఇలాహ ఇల్లల్లాహ్” (అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేదు) అన్న ఒక్క మాట అనండి. పెదనాన్నా! నేను ఈ కలిమా (వచనం) ఆధారంగా అల్లాహ్ వద్ద మీ కొరకు సిఫారసు చేస్తాను’** అని బతిమిలాడారు. అక్కడ గుంట నక్కవలె ముందు నుండే కాచుకు కూర్చుని ఉన్న అబూ జహల్, ‘అబూ తాలిబ్! అబ్దుల్ ముత్తలిబ్ మతాన్ని వదలిపెడతావా?’ అంటూ ఏదేదో చెప్పడం మొదలెట్టాడు. చివరికి “అబ్దుల్ ముత్తలిబ్ మతంపైనే” అంటూ కన్ను మూశారు అబూ తాలిబ్. అబూ తాలిబ్ ఇస్లాం స్వీకరించక పోయినప్పటికీ ముస్లింలకు ఆయనగారి నైతిక మద్దతు ఉండేది. అయితే ఆ ‘రక్షా కవచం’ కూడా ఇప్పుడు లేకుండా పోయింది. అబూ తాలిబ్ మరణించిన రెండు మూడు నెలలకే విశ్వాసుల మాత (ఉమ్ముల్ మోమినీన్) హజ్రత్ ఖదీజా (ర) కూడా పరమపదించారు. అప్పటికి ఆమె వయస్సు 65 సంవత్సరాలు. ప్రవక్త (ﷺ) గారి వయసు 50 సంవత్సరాలు.

హజ్రత్ ఖదీజా (ర.అ), ప్రవక్త ﷺ గారి గొప్ప ఆదర్శవంతమైన ఇల్లాలు. 25 సంవత్సరాలు ఆయనపై ప్రేమానురాగాల్ని కురిపిస్తూ, కష్టసుఖాలలో చేదోడు వాదోడుగా ఉంటూ, ధర్మప్రచారంలో సహాయపడుతూ, ఆర్థికంగా ఎంతగానో ఆదుకుంటూ జీవించారు. ఆమెలోని ఈ త్యాగశీలాన్ని మెచ్చుకుంటూ ప్రవక్త ﷺ తరచూ ఇలా అనేవారు:"ప్రజలు నన్ను వ్యతిరేకించినప్పుడు తను నన్ను విశ్వసించింది. ప్రజలు నన్ను తప్పు పట్టినప్పుడు తను మాత్రం నా మాట అక్షర సత్యమని ధృవీకరించింది. ప్రజలు నన్ను ఆర్థికంగా దెబ్బ తీయాలనుకున్నప్పుడు తను తన సొంత ఆస్తితో నన్నాదుకుంది. ఆమె ద్వారానే అల్లాహ్ నాకు సంతానాన్ని అనుగ్రహించాడు".

ఈ రెండు విషాదకర సంఘటనలు కొన్ని రోజుల తేడాతోనే సంభవించాయి. భరించరాని తీవ్ర ఆవేదనకి లోనయ్యారు ప్రవక్త ﷺ. అబూ తాలిబ్ మరణానంతరం ఆయన తన జాతి వారిచే అనేక ఇక్కట్లను ఎదుర్కొన్నారు. వారి ఆగడాలు రానురాను పెచ్చరిల్లాయి.

### సౌదా (ర.అ) గారితో వివాహం

నబవీ శకం 10వ సంవత్సరంలోనే ప్రవక్త ﷺ జమ్ఆ కూతురు సౌదా (ర.అ)ను వివాహమాడారు. ఆమె తొలి కాలంలో ఇస్లాం స్వీకరించినవారిలో ఒకరు. ఆమె తన భర్తతో అబీసీనియాకు వలస కూడా పోయారు. కాని భర్త అక్కడే మరణించాడు. ఆమె అబీసీనియా నుండి తిరిగి వచ్చిన తర్వాత ప్రవక్త ﷺ ఆమెకు పెళ్ళి సందేశం పంపి ఆమెను మనువాడారు.

**మక్కా వెలువల ఇస్లాం ప్రచారం**

### తాయిఫ్‌లో ప్రవక్త ﷺ

నబవీ శకం పదవ సంవత్సరంలో ప్రవక్త ﷺ తాయిఫు పట్టణానికి బయలుదేరారు. అది మక్కాకు 60 మైళ్ళ దూరాన ఉంది. దైవప్రవక్త ﷺ తన బానిస హజ్రత్ జైద్ బిన్ హారిసా (ర)ను వెంటబెట్టుకుని తాయిఫ్‌కి కాలి నడకన ప్రయాణమయ్యారు. దారిలో తారసపడే ప్రతి తెగవారిని ఇస్లాం వైపు ఆహ్వానించారు. అయితే వారిలో ఏ ఒక్కరు కూడా ఈ ఆహ్వానాన్ని స్వీకరించలేదు. ఆ తరువాత సరాసరి తాయిఫ్ చేరుకున్న ప్రవక్త ﷺ అక్కడ పది రోజులు మకాం వేశారు. పుర ప్రముఖులను కలుసుకొని ప్రతి ఒక్కరితో చర్చించారు. దైవ సందేశం అందజేసి ఇస్లాం స్వీకరించమని ప్రాధేయపడ్డారు.

కాని వారు ప్రవక్త (ﷺ) గారితో అమర్యాదగా ప్రవర్తించడమే కాక, ఊరి నుండి బైటకు పొమ్మని విదిలించారు. వారిలోని మూర్ఖులను, అలగా జనాలను, తుంటరి పిల్లలను ప్రవక్త (ﷺ) పైకి ఉసిగొల్పారు. దైవ ప్రవక్త (ﷺ) తిరిగి వెళ్ళాలని సంకల్పించుకున్నప్పుడు ఈ అల్లరి మూకలు వెంటబడి ఆయన్ను వేధించనారంభించారు. నోటికొచ్చినట్లు వాగటం, దుర్భాషలాడటం మొదలెట్టారు. ఇది చూసి మరికొంత మంది కూడా వారికి తోడయ్యారు. ఇప్పుడు రాళ్ళు కూడా రువ్వనారంభించారు. అప్పుడు ఆయన (ﷺ)కు కలిగిన గాయాల నుండి కారిన రక్తంతో ఆయన పాదరక్షలు నిండిపోయాయి.

ప్రవక్త (ﷺ) తాయిఫ్ పట్టణం నుండి బాధగా, నీరసంగా నడుస్తూ మక్కా వైపు వస్తున్నారు. ప్రవక్త (ﷺ) ఖర్నుల్ మనాజిల్ (నేడు ఇహ్రాం బూనే సరిహద్దు) చేరుకోగానే, అల్లాహ్ పర్వతాల పర్యవేక్షకుడైన దైవ దూతను జిబ్రయీల్ (عليه السلام)కు తోడు చేసి పంపాడు. అలా దైవాజ్ఞతో వచ్చిన జిబ్రయీల్ (عليه السلام)– "అల్లాహ్ మీరు భరించిన చిత్రహింసల్ని చూసి నాకు తోడుగా పర్వతాల దూతను పంపాడు. మీరు ఒక్క సైగ చేస్తే చాలు ఈ తాయిఫ్ పట్టణానికి ఇరువైపుల ఉన్న పర్వతాల్ని కలిపి పట్టణాన్ని నుజ్జు నుజ్జు చేసేస్తాము" అని విన్నవించుకున్నారు. అందుకు దైవ ప్రవక్త (ﷺ) ప్రశాంత వదనంతో – "నేను సమస్త లోకాల పాలిట మూర్తీభవించిన కారుణ్యంగా ప్రభవించానే తప్ప శిక్షను కోరుకునే వ్యక్తిగా కాదు. నేడు ఈ తరం నన్ను విశ్వసించకపోయినా, తర్వాతి తరం ఖచ్చితంగా నన్ను విశ్వసించి తీరుతుందన్న నమ్మకం నాకుంది. ఆ మేరకు దైవాన్ని నేను వేడుకున్నాను కూడా" అని బదులిచ్చారు. ప్రవక్త (ﷺ) నఖ్లా అనే లోయలో ఉండగా జిన్నుల ఓ సమూహాన్ని అక్కడికి పంపాడు దేవుడు. వారి గురించి ఖుర్ఆన్‌లో రెండు చోట్ల – అహ్ఖాఫ్ మరియు జిన్ అధ్యాయాల్లో ప్రస్తావించబడింది కూడా. ప్రవక్త (ﷺ) వారు ఖుర్ఆన్ సుమనోహర ధునిని మధురమైన తమ స్వర ధ్వనితో కోటిరాగాలు పలికిస్తూ ఉండగా విన్న జిన్నుల సమూహం తన్మయంతో ఆనంద పరవశమయ్యింది. శ్రద్ధగా శ్రావ్య శ్రవణానందంగా ఖుర్ఆన్ మహోజ్వల వాణిని ఆలకించిన జిన్నులు తరువాత తమ జాతి వారి వద్దకు వెళ్ళి ఇలా హెచ్చరించారు: "ప్రవక్త మూసా (عليه السلام) తర్వాత గత గ్రంథాలను ధృవపరిచే, సన్మార్గం చూపించే ఓ అద్భుత గ్రంథాన్ని మేము విన్నాము". ఈ యదార్థ సంఘటననే అల్లాహ్ ఈ విధంగా పేర్కొన్నాడు: "మేము జిన్నుల సమూహం ఒకదాన్ని ఖుర్ఆన్ వినేందుకు నీ దగ్గరకు పంపాము. వారు (నీవు ఖుర్ఆన్ పఠిస్తున్న) ఆ స్థలాన్ని చేరుకొని నిశ్శబ్దంగా ఉండండని పరస్పరం చెప్పుకున్నారు. ఖుర్ఆన్ పఠనం ముగిసిన తర్వాత వారు భయబోధకులుగా

తమ జాతి వద్దకు వెళ్ళారు. వారు అక్కడకు వెళ్ళి ఇలా అన్నారు: **"ఓ మా జాతి వారలారా! మేము ఒక గ్రంథాన్ని విన్నాము. అది మూసా (అ) తర్వాత అవతరించింది. తనకు పూర్వం అవతరించిన గ్రంథాలను ధృవీకరిస్తుంది. సత్యం వైపునకు, రుజుమార్గం వైపునకు దారి చూపిస్తుంది".**

(దివ్యఖుర్ఆన్ – 46: 29,30)

నబవీ శకం 11వ సంవత్సరంలో ప్రవక్త (ﷺ) మక్కాకు తిరిగి వచ్చారు. హజ్ కాలం సమీపించింది కనుక ఆ సమయంలో దేశం నలువైపుల నుండి వచ్చే విభిన్న తెగలవారికి ఇస్లాం పరిచయం చేయాలి. ఈ కృషి ఫలితంగా ఆ వచ్చిన తెగల్లోని మదీనాకు చెందిన ఆరుగురు ఇస్లాం స్వీకరించారు. బనూ ఆమిర్, బనూ కల్బ్, బనూ హనీఫా తెగవారు మాత్రం ఈ సందేశాన్ని అంగీకరించలేదు. ఆ సందర్భంలో ప్రవక్త (ﷺ) ప్రత్యేకంగా కొందరు ప్రముఖుల్ని కూడా కలుసుకున్నారు. వారిలో 'సువైద్ బిన్ సామిత్' ఒకరు. ఆయన తన ఇస్లాంను బాహాటంగా ప్రకటించారు. అలాగే అబూ జర్ గిఫారీ, తుఫైల్ బిన్ అమ్ర్ దౌసీ కూడా ప్రవక్త (ﷺ) గారి పిలుపుపై ఇస్లాం ధర్మాన్ని స్వీకరించారు.

## హజ్రత్ ఆయిషా (ర) గారితో ప్రవక్త (ﷺ) వారి వివాహం

నబవీ 11వ సంవత్సరం షవ్వాల్ మాసంలో హజ్రత్ ఆయిషా (ర) గారిని ప్రవక్త (ﷺ) వివాహమాడారు. హిజ్రీ శకం మొదటి సంవత్సరం షవ్వాల్ మాసంలో హజ్రత్ ఆయిషా (ర) దైవ ప్రవక్త (ﷺ) వారితో కాపురానికి వెళ్ళారు.

## ఇస్రా - మేరాజ్

స్వీకారానికి – ప్రతీకారానికి మధ్య సంఘర్షణగా ప్రవక్త (ﷺ) గారి ధర్మప్రచారం కొనసాగుతూ ఉండగా 'ఇస్రా – మేరాజ్' అద్భుత సంఘటన ఒకటి కని, విని, ఎరుగని విధంగా జరిగింది. ప్రవక్త (ﷺ) గారి ఈ గగన యాత్ర, మస్జిదె హరామ్ నుండి మస్జిదె అక్సాకు, అక్కడి నుండి ఏడు ఆకాశాలపై వరకు కొనసాగింది. ప్రవక్త (ﷺ) మస్జిదె

**దైవ ప్రవక్త (ﷺ) ముందుకు సాగిపోతూ ఓ చోట ఇబ్బడిముబ్బడిగా వడ్డీ తినే జలగాగ్రేసరులను చూశారు. వారి పొట్టలు విపరీతంగా పెరిగి ఉండటం గమనించారు. అవి పాములతో, నరకపు తేళ్లతో నిండి ఉన్నాయి. మరో చోట – ఓ వైపు ఘుమఘుమలాడే షడ్రుచుల మాంసం వడ్డించబడి ఉంది. మరో వైపు కుళ్ళి కంపు కొడుతున్న మాంసం ఉంది. పర స్త్రీతో, పర పురుషునితో పెళ్లిపెటాకుల్లేకుండానే సహ జీవనం సాగించే పచ్చి వ్యభిచారులు మంచి మాంసాన్ని వదలి కంపు కొడు^న్న మాంసాన్నే తింటున్నారు.**

హరామ్ నుండి దైవ దూత జిబ్రయీల్ ﴾عليه السلام﴿తో బురాఖ్ అనబడే ఓ దివ్యలోక వాహనంపై బయలుదేరి మస్జిదె అక్సాకు చేరుకున్నారు. అక్కడ దైవప్రవక్తలందరికీ నాయకత్వం వహించి నమాజు చేశారు. బురాఖ్‌ని మస్జిద్ ద్వారానికి కట్టివేశారు. అదే రాత్రి మస్జిదె అక్సా నుండి ప్రవక్త ﴾ﷺ﴿ గారిని వెంటబెట్టుకుని ఓ దివ్యమైన నిచ్చెన ద్వారా గగనానికి సాగిపోయారు హజ్రత్ జిబ్రయీల్ ﴾عليه السلام﴿.మొదటి ఆకాశంలో ఆదమ్ ﴾عليه السلام﴿ఎదురయ్యారు. ప్రవక్త ﴾ﷺ﴿ ఆయనకు సలాం చేశారు. ఆయన అభివా దానికి ప్రతి అభివాదం చేస్తూ 'స్వాగతం! స్వాగతం!!' అని అమిత వాత్సల్యంతో ఆహ్వానించారు. ఆయన ముహమ్మద్ ﴾ﷺ﴿ అంతిమ దైవ ప్రవక్తని సాక్ష్యమిచ్చారు.

ఆ తర్వాత రెండవ ఆకాశానికి చేరుకున్నారు. లోనికి ప్రవేశించాక అక్కడ హజ్రత్ జకరియ్యా కుమారుడగు యహ్యా (యోహాను) ప్రవక్త, మర్యం కుమారుడగు హజ్రత్ ఈసా ﴾عليه السلام﴿ తారస పడ్డారు. ప్రవక్త ﴾ﷺ﴿ గారు వారికి సలాము చేయగా, వారిద్దరూ బదులిస్తూ ఘనంగా స్వాగతించారు. ముహమ్మద్ ﴾ﷺ﴿ దేవుని అంతిమ ప్రవక్త అన్న విషయాన్ని ధృవపర్చారు. దరిమిలా మూడో ఆకాశానికి చేరుకున్నారు. అక్కడ హజ్రత్ యూసుఫ్ ﴾عليه السلام﴿ను కలిశారు. మునుపటిలాగే సలాం ప్రతి సలాం జరిగింది. నాల్గవ ఆకాశాన హజ్రత్ ఇద్రీస్ ﴾عليه السلام﴿తోనూ, ఐదవ ఆకాశాన హజ్రత్ హారూన్ ﴾عليه السلام﴿తోనూ, ఆరవ ఆకాశాన హజ్రత్ మూసా ﴾عليه السلام﴿తోనూ, ఏడవ ఆకాశాన హజ్రత్ ఇబ్రాహీమ్ ﴾عليه السلام﴿తోనూ కలిశారు. వారందరూ కూడా సలాంకు బదులిస్తూ, స్వాగతం సత్ప్రవక్తా! అంటూ ఎంతో ప్రేమగా ఆహ్వానించారు.

ఆ పిదప **'సిద్రతుల్ మున్‌తహా'** వరకు ఎక్కి వెళ్ళారు. అక్కడ్నుంచి 'బైతుల్ మామూర్' (కాబాకు నేరుగా ఏడు ఆకాశాలపై ఉన్న దైవ గృహం) చేరుకున్నారు. అక్కడి నుండి అల్లాహ్ వైపునకు ఎక్కి వెళ్ళారు. అల్లాహ్‌కు చాలా దగ్గరయ్యారు. అప్పుడు అల్లాహ్ తన దాసునికి అందజేయవలసిన దివ్య సందేశాన్ని అందజేశాడు. మహా ప్రవక్త ﴾ﷺ﴿ వారి సముదాయం కొరకు రోజుకు యాభై వేళల నమాజును విధిగా నియమించాడు. మహా ప్రవక్త ﴾ﷺ﴿ అక్కడి నుండి తిరిగి వస్తుండగా హజ్రత్ మూసా ﴾عليه السلام﴿ కలిశారు. విషయం తెలుసుకుని –"మీ సమాజం యాభై పూటల (రేయింబవళ్లల్లో) నమాజు భారాన్ని మోయజాలదు. తిరిగి వెళ్ళండి, వెళ్ళి కొన్ని నమాజులు తగ్గించమని మీ ప్రభువును వేడుకోండి" అన్నారు హజ్రత్ మూసా ﴾عليه السلام﴿. ఇలా అనేక సార్లు దైవ సన్నిధికి వెళ్ళి రాగా చివరికి ఆ సంఖ్య తగ్గుతూ తగ్గుతూ 5 పూటల నమాజుగా ఖరారు అయింది, ఈ అయిదు పూటల నమాజు చేసే వ్యక్తికి 50 పూటల నమాజు చేసేంత పుణ్యం లభిస్తుందని అల్లాహ్ ఫర్మానా జారీ చేశాడు.

ఈ యాత్ర సందర్భాన అనేక అద్భుతాలను చూశారు దైవ ప్రవక్త (ﷺ). ఈ యాత్రలోనే జిబ్రయీల్ (عليه السلام), ప్రవక్త (ﷺ) ఎదుట మధువు మరియు పాలున్న రెండు వేర్వేరు పాత్రలు ఉంచారు. మహా ప్రవక్త (ﷺ) పాల పాత్రను స్వీకరించారు. ఇది చూసి "మీరు సహజ ధర్మాన్ని ఆశ్రయించారు" అన్నారు జిబ్రయీల్ (عليه السلام). ఈ యాత్ర మధ్యలోనే ఆగ్రహంతో అగ్ని జ్వాలను తలపిస్తున్న నరక పాలకుని ముఖం చూశారు. స్వర్గ – నరకాలను సందర్శించారు. అలా ముందుకు వెళుతుండగా – ఓ చోట ఇబ్బడిముబ్బడిగా వడ్డీ తినే జలగాగ్రేసరులను చూశారు. వారి పొట్టలు విపరీతంగా పెరిగి ఉండటం గమనించారు. అవి పాములతో, నరకపు తేళ్లతో నిండి ఉన్నాయి. మరో చోట – ఓ వైపు ఘుమఘుమలాడే షడ్రుచుల మాంసం వడ్డించబడి ఉంది. మరో వైపు కుళ్ళి కంపుకొడుతున్న మాంసం ఉంది. పర స్త్రీతో, పర పురుషునితో పెళ్లిపెటాకుల్లేకుండానే సహజీవనం సాగించే పచ్చి వ్యభిచారులు మంచి మాంసాన్ని వదలి కంపుకొడుతున్న మాంసాన్నే తింటున్నారు. ఇలా చెప్పుకుంటూపోతే ఈ యాత్రలోని వింతలు అగణ్యం! ఇందులోని అద్భుతాలు అసంఖ్యాకం!!

మహా ప్రవక్త (ﷺ) గారు ఈ ప్రయాణ సందర్భంగా దారి మధ్యలో ఖురైషుకి సంబంధించిన ఓ వర్తక బృందాన్ని చూశారు. వారి దగ్గర నీళ్ళు కూడా త్రాగారు. తెల్లవారిన తర్వాత ఆయన(స) ఒకే ఒక్క రాత్రిలో జరిగిన అద్భుత విషయాలు, వింత విశేషాల గురించి ఖురైషు ప్రజలకు విన్పించారు. అయితే వారంతా దీన్ని ఖండిం చారు. ముక్త కంఠంతో ఆయన్ను వ్యతిరేకించారు. ఒక్క రాత్రిలో ఇదంతా ఎలా సాధ్యం అని పరిహసించారు. ముహమ్మద్ (ﷺ) అబద్ధమాడుతున్నారని తూలనాడారు. ఒకవేళ ఇది నిజంగానే జరిగి ఉంటే – బైతుల్ మఖ్దిస్ ఎలా ఉంటుందో వర్ణించమని పట్టు బట్టారు. అప్పుడు ప్రవక్త (ﷺ) బైతుల్ మఖ్దిస్ గురించి వివరించడమే కాక, దారిలో తారసపడిన ఆ వర్తక బృందాలు ఎప్పుడు మక్కా చేరుకుంటాయో కూడా విశదపర్చారు. ఇంత చెప్పినా కూడా వారిలో వ్యతిరేకత పెరిగిందే తప్ప తరగలేదు. అయితే హజ్రత్ అబూబకర్ (ర) మాత్రం ఈ సంఘటనను అక్షర సత్యం అని ధృవీకరించారు. ప్రజలంతా అబద్ధం అని నోరు బాదుకుంటున్నా ఆయన వారి మాటను ఖాతరు చేయలేదు. ఈ కారణంగానే 'సిద్దీఖ్' (ధృవపరచినవాడు) అనే బిరుదు ఆయన సొంతమయ్యింది. **'ఇస్రా – మేరాజ్'** అనే ఈ సంఘటన దైవ సూచనల్లోని ఓ అద్భుత సూచన.

## అఖ్బా శపథం - 1,2

మదీనాకు చెందిన ఆరు మంది ఇస్లాం స్వీకరించారని మనం ముందే తెలుసుకున్నాం. అది నబవీ శకం 7వ సంవత్సరం హజ్ దినాల్లో జరిగిన సంఘటన. తాము స్వీకరించిన ధర్మాన్ని తమ జాతి వారికి అందజేస్తామని వారు మాట ఇచ్చారు. ఇపుడు నబవీ శకం 12వ సంవత్సరం హజ్ దినాల్లో 12 మంది వచ్చారు. వారిలో అయిదుగురు గత సంవత్సరం ప్రవక్త ముహమ్మద్ (ﷺ)గారిని కలిసి ఇస్లాం స్వీకరించినవారే. 'అఖ్బా' అనే ప్రాంతంలో వారందరూ ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారిని కలుసుకున్నారు. వారంతా ఈ విషయాలపై ప్రమాణం చేశారు-

**1- ఒక్కడైన అల్లాహ్‌ను తప్ప మరెవరినీ పూజించము**
**2- దొంగతనం దోపిడీలకు పాల్పడము.**
**3- వ్యభిచారం చేయము.**
**4- ఇతరులపై అభాండాలు మోపము.**
**5- ప్రవక్త ముహమ్మద్ (ﷺ) ఎప్పుడు, ఏ మంచి కార్యం (మారూఫ్) కై ఆజ్ఞాపించినా దాన్ని శిరసావహిస్తాము.**

ఈ శపథం చేసి హజ్ దినాలు ముగిశాక, శపథం చేసినవారికి మదీనాలో ఇస్లాం ఆదేశాల్ని బోధించడానికి, వారికి శిక్షణ ఇవ్వడానికి, వారిలో ధార్మిక చైతన్యాన్ని తీసుకురావడానికి తన మొదటి ప్రతినిధిని పంపారు ప్రవక్త ముహమ్మద్ (ﷺ). ఆ ప్రతినిధే హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమైర్ (ర). ఈయన మదీనాలో ఇంటింటికీ వెళ్ళి వారిని ఇస్లాం కారుణ్య ఛత్రఛాయల్లోకి ఆహ్వానించేవారు. ఆయన అవిరళ కృషి వల్ల మదీనాలోని ప్రతి ఇంటా సత్య జ్యోతి వెలిగింది. ప్రతి ఇంట్లో ఒకరిద్దరు స్త్రీపురుషులు ఇస్లాం స్వీకరించారు.

నబవీ శకం13వ సంవత్సరం హజ్ దినాలలో హజ్ విధిని నెరవేర్చడానికి మదీనా నుండి 70 మంది ముస్లింల బృందం ఒకటి మక్కా చేరుకుంది. వారు మక్కా చేరుకున్నాక ప్రవక్త ముహమ్మద్ (ﷺ) గారితో రహస్య సమాలోచనలు జరిపారు. మినాలో అఖ్బా అనే చోట ప్రవక్త ముహమ్మద్ (ﷺ)తో సమావేశమయ్యారు. ఈ సమావేశాన్ని 'రెండవ అఖ్బా శపథం' గా వ్యవహరిస్తారు. అందలి ముఖ్యాంశాలు ఇవి-

**1) మంచికి చేరువలో ఉంటాం. చెడుకి బహు దూరంగా మసలుకుంటాం.**
**2) ప్రవక్త ముహమ్మద్ (ﷺ) ఎప్పుడైనా మదీనా వేంచేస్తే మా బొందిలో ప్రాణమున్నంత వరకు ఆయనతో సహకరిస్తాం.**

**3) మా భార్యాపిల్లల్ని, మా ప్రాణాల్ని పణంగాపెట్టైనా సరే ఆయన్ను రక్షిస్తాము. అలా గనక మా ప్రాణాలు పోతే మాకు స్వర్గం ప్రాప్తమవుతుందని ఎంతో ఉత్తేజపూరితంగా మాట ఇచ్చారు.**

ఈ విధంగా వారు పవక్త ముహమ్మద్ (ﷺ) గారి కోసం వేయి కళ్ళతో ఎదురు చూడ సాగారు.

**విశ్వాసం త్యాగాన్ని కోరుతుంది**

**మీ అమ్మాయిని తీసుకెళుతున్నారు బాగానే ఉంది. కాని ఈ పిల్లవాడు మా వంశోద్ధారకుడు. వీడ్ని తీసుకెళ్ళదానికి ఎంత మాత్రం వీల్లేదు. 'ఇతను మావాడు' అని వీరు, 'మా వాడు' అని వారు ఘర్షణ పద్దారు. ఈ ఇరు కుటుంబాల పెనుగులాటలో ఆ పసికందు చేయి ఒకటి ఊడి వచ్చేసింది పాపం! అయినా కర్కశులైన వారు తల్లిని, వీరి బిడ్డను తీసుకెళ్ళిపోయారు.**

## హిజ్రత్ సూచనలు

రెండవ అఖ్బా శపథం ముగింపుతో, ఇస్లాం తన కోసం ఓ ప్రదేశాన్ని ఏర్పాటు చేసుకోవడంలో సఫలమయ్యింది. తన ఆవిర్భావం తర్వాత ఇది ఇస్లాంకు లభించిన అతి పెద్ద విజయంతో సమానం. ఇప్పుడు ప్రవక్త ముహమ్మద్ (ﷺ) ఆ ప్రదేశానికి వలస పోవటానికి ముస్లింలకు అనుమతి ఇచ్చారు. అనుమతి లభించగానే అనేక మంది పీడిత ముస్లింలు మదీనాకు వెళ్ళనారంభించారు. వారికి బాగా తెలుసు–హిజ్రత్ అంటే, తమ ధన మాన ప్రాణాలను, ఇల్లూ వాకిలిని త్యాగం చెయ్యాల్సి ఉంటుందని! ఇప్పుడు వారు తమ ఉజ్వల భవిష్యత్తు కోసం సాగిపోతున్నారు. ఈ మార్గంలో వారు ఎదుర్కొన్న ఇక్కట్లను గమనిద్దాం రండి!

## 1) హజ్రత్ సుహైబ్ రూమీ (ర)

ఆయన (ర) హిజ్రత్‌కు సిద్ధమయినప్పుడు ఖురైష్ వారు "నీవు దేనికీ గతిలేనివాడిలా తిరుగుతూ మా వద్దకు వచ్చావు. మా దగ్గర నీ సంపద పెరిగింది. వచ్చిన కొన్నాళ్ళకే గొప్ప స్థానాన్ని సంపాదించుకున్నావు. ఇవన్నీ జరిగాక ఇప్పుడు నీ సంపదనంతా నీతోపాటు తీసు కెళ్ళాలని చూస్తున్నావా? దైవసాక్షి! ఇది జరగదు" అన్నారు. 'సరే నా సంపదనంతా మీ వద్ద వదిలిపెట్టితే నన్ను పోనిస్తారా?' అని అడిగారు రూమీ. "ఓ. అలాగైతే మాకు ఏ అభ్యంతరం ఉండదు" అన్నారు వారు. 'ఇక నుంచి నా ఈ సంపదంతా మీదే' అంటూ ఆయన మదీనా వైపు సాగిపోయారు. ఈ వార్త తెలుసుకున్న ప్రవక్త ముహమ్మద్ (ﷺ) **"సుహైబ్ లాభం పొందాడు. సుహైబ్ లాభం పొందాడు"** అని ఆయన నిరుపమాన త్యాగాన్ని కొనియాడారు.

## 2) సలమా తల్లిదండ్రులు:

వలస ప్రయాణీకుల్లో మొదటివారు అబూ సలమా, ఆయన సతీమణి, వారిరువురి కుమారుడు. ఈ విషయం తెలుసుకున్న ఉమ్మె సలమా (ర) గారి బంధువులు వచ్చి వాళ్ళను అటకాయించారు. "ఓ అబ్బాయి! నీవు పోదలిస్తే పో. అంతేగాని, మా అమ్మాయి (నీ భార్య)ని మాత్రం తీసుకెళ్ళేందుకు వీల్లేదు" అని అక్కడ్నుంచి ఆమెను బలవంతాన లాక్కెళ్లి పోయారు. ఇది చూసిన అబూ సలమా (ర) బంధువులు మండిపడ్డారు. మీ అమ్మాయిని తీసుకెళుతున్నారు బాగానే ఉంది. కాని ఈ పిల్లవాడు మా వంశోద్ధారకుడు. వీడ్ని తీసుకెళ్ళడానికి ఎంత మాత్రం వీల్లేదు. 'ఇతను మా వాడు' అని వీరు, 'మా వాడు' అని వారు ఘర్షణ పడ్డారు. ఈ ఇరు కుటుంబాల పెనుగులాటలో ఆ పసికందు చేయి ఒకటి ఊడి వచ్చేసింది పాపం! అయినా కర్కశులైన వారు తల్లిని, వీరి బిడ్డను తీసుకెళ్ళిపోయారు. (ఒక్క నిమిషం ఆలోచించండి! ఆ హృదయ విదారక దృశ్యం ఎలా ఉండి ఉంటుందో!!)

అబూ సలమా (ర) గత్యంతరంలేక, నిస్సహాయుడిలా మదీనా వైపు సాగి పోయారు. ఇటు భర్తను, అటు బిడ్డను పోగొట్టుకున్న ఉమ్మె సలమా (ర) ప్రతి రోజు ఉదయం సాయంత్రం ఏకధాటిగా రోదించసాగారు. ఇలా దాదాపు ఏడాదిపాటు ఎడబాటును భరిస్తూ విరహవేదనతోనే గడిపారు. చివరికి ఆమె ఓ దగ్గరి బంధువు హృదయం ద్రవించింది. "పాపం! ఈ అబలని హిజ్రత్ కోసం అనుమతి ఇవ్వండ"ని అన్నాడు. అతని చొరవ వల్ల తాను వారి బారి నుండి బయట పడటమే కాక, తన పిల్లవాడ్ని కూడా దక్కించుకుంది. అలా ఆమె ఎవరూ లేకుండానే భర్త వలస వెళ్ళిన ప్రాంతమయిన మదీనా వైపు కాలి నడకన బయలుదేరింది. కొంత దూరం వెళ్లాక ఉస్మాన్ బిన్ మజ్ఊన్ తారసపడి ఆమె విషమయ స్థితిని గమనించి ఆమెకు తోడుగా ఉంటూ మదీనా పొలిమేరల వరకు చేర్పించి వచ్చారు. ఆ విధంగా ఆమె తన భర్తను చేరుకుంది. ఈ రెండు సంఘటనలు మచ్చుకు మాత్రమే. ఇస్లాం సనాతన చరిత్రలో ఇటువంటి సంఘటనలు కోకొల్లలు.

అలా ఒకరి తర్వాత ఒకరు మక్కాలో ఉన్న ముస్లింలంతా రెండవ అఖ్బా శపథం తర్వాత రెండు నెలల లోపే మదీనా వెళ్లిపోయారు. మక్కాలో ప్రవక్త ముహమ్మద్ (ﷺ), హజ్రత్ అబూ బకర్ (ర), హజ్రత్ అలీ (ర), తదితరులు కొద్ది మంది మాత్రమే మిగిలిపోయారు.

# దారున్నద్వా (ఖురైష్ పార్లమెంట్)

ప్రవక్త (ﷺ) గారి సహచరులు చాలా మంది మదీనాకు వలస పోయారు. మదీనాలో ఔస్, ఖజ్రజ్ ప్రముఖ తెగలు. వారే తర్వాత అన్సార్‌గా పిలువబడ్డారు. కారణం – వారు విశ్వాసులకు, హిజ్రత్ చేసి వచ్చిన ముస్లింలకు ఆశ్రయం ఇచ్చి ఆదుకున్నారు. మదీనాకు వెళ్ళి ముస్లింలు శక్తిని పుంజుకోవడం, వారి ద్వారా ఇస్లాం పరివ్యాప్తి చెందడం చూసి మక్కా విగ్రహారాధకుల శిబిరాల్లో కలవరం పుట్టింది. వారు ఈ పరిణామాన్ని జీర్ణించుకోలేకపోయారు. ఎందుకంటే – వారి చిల్లర దేవుళ్ల రాజ్యం సమీపంలోనే పతనం కానున్నది. దైవ ప్రవక్త (ﷺ) వారి వ్యక్తిత్వం గురించి వారికి బాగా తెలుసు. ఆయన సత్యసంధత, నాయకత్వ లక్షణం గురించి, ఆయన సహచరుల ధైర్య సాహసాల గురించి, విశ్వాసంపై వారిలో గల నిలకడ, స్థిరచిత్తం, ఆత్మ బలం గురించి వారికి తెలిసినంతగా ఇంకెవ్వరికీ తెలీదు. ఎందుకంటే అది వారందరికి అనుభవైక విషయమే కాబట్టి. పైగా ఔస్, ఖజ్రజ్ కూడా ప్రవక్త (ﷺ) వారి పక్షాన్నే ఉన్నారు. కనుక ఖురైషు నాయకులంతా కూడ బలుక్కుని మక్కాలో ఓ పార్లమెంటు ఏర్పాటు చేశారు.

చుట్టుప్రక్కల తెగలన్నింటినీ ఆ పార్లమెంటులో సమావేశపరచి – ప్రతి తెగలో నుంచి ఒక్కొక్క యువకుడ్ని ఎన్నుకున్నారు. వారంతా కలిసి మూకుమ్మడిగా ముహమ్మద్ (ﷺ) వారిపై దాడి చేసి, ఆయన్ని హతమార్చాలన్నది వారి పథకం. అలా చేయడం ద్వారా ఈ హత్యానేరం తెగలన్నింటిపై పడుతుంది. అప్పుడు హాషిమ్ వంశీయులకు తెగలన్నింటినీ ఎదిరించి పోరాడటం సాధ్యపడదన్నది వారి ఎత్తుగడ.

## ముహమ్మద్



## వారి హిజ్రత్

దైవప్రవక్త (ﷺ)ను కడతేర్చాలన్న (నవూజుబిల్లాహ్ – దైవం మన్నించు గాక!) ఒప్పందం జరిగిన తర్వాత దైవ దూత జిబ్రయీల్ (عليه السلام) ప్రవక్త (ﷺ) వారి దగ్గరకు వచ్చి ఖురైషుల పన్నాగం గురించి తెలియపర్చడంతో పాటు, వలస పోవడానికి అల్లాహ్ అనుమతించాడని తెలిపారు. బయలుదేరవలసిన సమయం కూడా నిర్ధారించారు జిబ్రయీల్ (عليه السلام). అలాగే ఈ రాత్రి మీరు మీ పడకపై గడపకండని కూడా సలహా ఇచ్చారు. తర్వాత ప్రయాణ సన్నాహాల నిమిత్తం చర్చించడానికి ప్రవక్త (ﷺ) హజ్రత్ అబూ బకర్ (ర) గారిని సంప్రదించారు. మరో వైపు ఖురైషులు తమ పథకం అమలు పర్చే ఘడియ ఎప్పుడు వస్తుందా అని కాచుకుని ఉన్నారు.

రాత్రి వేళ తెగ నాయకుల్లో 12 మంది ప్రముఖులు, ప్రవక్త (ﷺ) వారి ఇంటి ముందు మాటు వేసి కూర్చుని ఉన్నారు. ప్రవక్త (ﷺ) ఎప్పుడు నిద్రపోతారా, ఎప్పుడు ఆయన్ను తుదముట్టించాలా అని పడిగాపులు కాస్తున్నారు. ఒప్పందం ప్రకారం అర్ధ రాత్రి పథకాన్ని అమలు పర్చాలి. వారంతా ఆ ఘడియ కోసం జాగారం చేస్తున్నారు. కాని భూమ్యాకాశాలను తన గుప్పిట్లో బంధించి ఉన్న ఆ పరమ ప్రభువు తను తలచిందే చేసి చూపించాడు. అర్ధరాత్రి వేళ దైవ ప్రవక్త (ﷺ) హజ్రత్ అలీ (ర) గారిని తన పడక మీద పడుకుని, తన ఆకు పచ్చ దుప్పటిని కప్పుకొని నిద్రపొమ్మని, తన దగ్గర ఉన్న అమానతులను హక్కుదారులకు చేరవేసి ఖుబా ప్రాంతంలో తమతో వచ్చి కలుసుకోవలసిందిగా ఆదేశించారు. ఆ దరిమిలా ప్రవక్త (ﷺ) బయటికి వచ్చి నేల మీది మన్ను కొంచెం చేతిలోకి తీసుకుని దాన్ని అవిశ్వాసులపై విసిరేస్తూ, ఖుర్ఆన్ వచనాలు (సూరయె యాసీన్) పఠిస్తూ వారి మధ్య నుండే వెళ్ళిపోయారు. ఆ క్షణంలో అల్లాహ్ వారి నుండి చూసే శక్తిని వశపర్చుకున్నాడు. ఆ పిదప ఎకాఎకిన హజ్రత్ అబూ బకర్ (ర) ఇంటికి వెళ్ళి, అక్కణ్నుంచి యమన్ దిశలో ఉన్న సౌర్ గుహ వైపునకు ఆ రాత్రే బయలుదేరారు.

ఇటు అవిశ్వాసుల మధ్య ఉత్కంఠభరిత వాతావరణం నెలకొని ఉంది. ఊపిరి బిగబట్టి మరీ దైవప్రవక్త (ﷺ)కోసం ఎదురు చూస్తున్నారు. అర్ధ రాత్రి దాటిపోయింది. వారి ఆరాటం ఎక్కువయ్యింది. ఇక ఉండబట్టలేక మెల్లగా తలుపు సందు నుంచి లోపలికి తొంగి చూశారు. పడక మీద పడుకుని ఉన్న హజ్రత్ అలీ (ర)ని చూసి, ప్రవక్త (ద) గారేమోనని భ్రమించారు. ఉదయం ప్రవక్త (ﷺ) వారి పడక మీద నుండి దుప్పటి తొలగించుకుంటూ నిద్ర లేచేందుకు ప్రయత్నిస్తున్న హజ్రత్ అలీ (ర) గారిని చూసి శత్రువులు నిర్ఘాంతపోయారు. మిన్ను విరిగి మీద పడ్డట్టయింది వారి పరిస్థితి. తెల్లబోయి ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. తమ పథకం తల్లకిందులయ్యిందన్న విషయం వారికి అర్థమవుతూనే ఉంది.

తెల్లవారాక శత్రువులు తన కోసం నలువైపులా గాలింపు చర్యలు ముమ్మరం చేస్తారని ముందుగానే ఊహించిన ప్రవక్త (ﷺ) మామూలు మార్గాన్ని వదలి దక్షిణ దిశగా ఉన్న మార్గం గుండా కాలి నడకన సౌర్ గుహకి చేరుకున్నారు. హజ్రత్ అబూ బకర్ (ర) కూడా ఆయనతో ఉన్నారు. ఈ మార్గం దట్టమైన పొదలతో, రాళ్ళతో కూడిన కఠినమైన మార్గం గనక కొండ రాగానే ప్రవక్త (ﷺ)ను తన భుజాల పైకి ఎత్తుకున్నారు హజ్రత్ అబూ బకర్ (ర). సౌర్ గుహను సమీపించి ముందు హజ్రత్ అబూ బకర్ (ర) గుహలోకి ప్రవేశించి రాళ్ళు, ముళ్ళు తీసేసి గుహను శుభ్ర

పర్చారు. అక్కడున్న కన్నాలు, బిలముల్లో గుడ్డ పేలికలు కుక్కి, జాగ్రత్త చర్యలు పూర్తయ్యాక ప్రవక్త (స) గారిని గుహ లోపలికి ఆహ్వానించారు. ఆ ఇద్దరు మిత్రులు ఆ గుహలో మూడు రాత్రులు గడిపారు. అబూ బకర్ (ర) కొడుకు అబ్దుల్లాహ్ రాత్రంతా వారిద్దరితో గడిపి ఉదయాన్నే మక్కాకు వెళ్ళేవారు. అక్కడ ఖురైషీయులు ప్రవక్త (స) వారికి వ్యతిరేకంగా ఏమేమి కుట్రలు పన్నుతున్నారో తెలుసుకొని రాత్రి పూట మళ్ళీ వచ్చి సమాచారాన్నంతా అందజేసేవారు. అబూ బకర్ (ర) సేవకుడు ఆమిర్ బిన్ ఫుహైరా మేకలు మేపుకుంటూ గుహ దగ్గరకు వచ్చేవాడు. వారిద్దరికి పాలు తాపించేవాడు. అలాగే అబ్దుల్లాహ్ గుహ వద్ద నుండి తిరిగి వెళ్లేటప్పుడు ఆయన అడుగు జాడలు గుర్తించకుండా ఉండేందుకు ఆయన వెనుక ఆమిర్ మేకలు తోలుకుంటూ అనుసరించేవాడు.

## యస్రిబ్‌లో అపూర్వ స్వాగతం

**"మాపై పూర్ణ చంద్రుడు ఉదయించాడు 'వదా' పర్వత శిఖరాల మధ్య నుండి అభినందనాలు, దైవానికి ధన్యవాదాలు మాపై తప్పనిసరి. ప్రార్థించేవారు ప్రార్థించగా మాలో ప్రభవించాడు ఓ మహా మహిమాన్వితుడా! నీ అమృత ప్రవచనాలే మాకు వీనుల విందు!!'**

మహా ప్రవక్త ముహమ్మద్ (స) మక్కా నుండి వెళ్ళిపోయారని తెలుసుకున్న ఖురైషీయులు అయోమయం లో పడ్డారు. ఎలాగైనాసరే ఆయన్ను పట్టుకు తీరాలని తీర్మా నించారు. అందు నిమిత్తం ఓ గొప్ప ప్రకటన కూడా చేశారు. ఎవరైనా ముహమ్మద్ (స)ను మరియు అబూ బకర్(ర)ను ప్రాణాలతోగానీ లేదా వారిరువురి మృత దేహాల్ని గాని తెచ్చియిస్తే వారికి 100 ఎర్ర ఒంటెలు బహు మానం అని లాలూచి చూపించారు. ఈ ప్రకటనను విని ఎందరో దురాశపరులు వారిరువురిని వెదకడానికి బయలు దేరారు. వాళ్ళు ఒక దశలో ప్రవక్త (స) ఆశ్రయం పొందిన గుహ దగ్గరికి చేరుకున్నారు కూడా. అయితే అల్లాహ్ తాను తలచిందే చేశాడు. దుష్టుల అరుపులు దగ్గరయ్యేకొద్దీ అబూ బకర్ (ర) అంతకంతకూ కలత చెందసాగారు. ఓ సందర్భంలో స్వయంగా ఆయన ఇలా అన్నారు: "దైవ ప్రవక్త (స)తో నేను గుహలో ఉండగా శత్రువుల పాదాలు స్పష్టంగా కనబడుతున్నాయి. దాంతో నేను కలత చెంది – 'ఓ దైవప్రవక్తా! వారిలోని ఒకడు బహుశా మనల్ని చూసేసి ఉంటాడన్న భయం కలుగుతోంది' అన్నాను. అందుకు ప్రవక్త (స) **"ష్....! మాట్లాడకు. మనం ఇద్దరమయితే మనకు తోడుగా మూడోవానిగా అల్లాహ్ ఉన్నాడు. వ్యాకులత చెందకు. అల్లాహ్ సహాయం మనకుంది"** అని అభయమిచ్చారు. బద్ధ శత్రువులు గుహ సమీపానికి చేరుకొని కూడా మమ్మల్ని చూడలేక భారంగా కాళ్ళీడ్చు కుంటూ తిరుగు ముఖం పట్టారు.

## మదీనా దిశగా ప్రయాణం

మక్కా అవిశ్వాసులు ప్రవక్త (ﷺ) వారికోసం వెతికి వేసారి విసిగిపోయారు. గుహలో మూడు రోజులు గడిపిన తర్వాత మదీనాకు బయలుదేరాలని నిశ్చయించుకున్నారు ప్రవక్త (ﷺ). అబ్దుల్లాహ్ బిన్ అరైఖిత్ – (తను విగ్రహారాధకుడే కాని ఎంతో నమ్మ కస్తుడు)కు కొంత పైకం చెల్లించి అరువు బేరం కుదుర్చుకున్నారు. తమ రెండు ఒంటెల్ని అతనికి అప్పజెప్పి మూడు రాత్రులు గడిచాక సౌర్ గుహ వద్దకు తీసుకు రమ్మన్నారు అబూ బకర్ (ర). ఆయన ఆదేశించినట్లే గుహ వద్దకు చేరుకున్నాడు ఇబ్ను అరైఖిత్. అబూ బకర్ (ర) గారి కూతురు హజ్రత్ అస్మా (ర) గారు ప్రయా ణానికి కావలసిన సామగ్రిని సిద్ధపర్చారు. కాని అన్నం పాత్ర బిగించి కట్టడానికి తాడు మరచిపోయారు. వెంటనే ఆమె తన ఓణిని రెండు ముక్కలుగా చింపి ఒక దాంతో దాన్ని కట్టారు. మరో భాగాన్ని తలపై కప్పుకున్నారు. అప్పటి నుంచి ఆమె **'జాతున్నతాఖైన్'** (రెండు ఓణీల పుణ్య స్త్రీ)గా చరిత్రలో చిరస్మరణీయురాలయింది.

ఆ తర్వాత దైవప్రవక్త (ﷺ), హజ్రత్ అబూ బకర్ (ర)తోపాటు దారి చూపించే ఇబ్బు అరైఖిత్ మదీనా దిశగా ప్రయాణమయ్యారు. ముందు మనం చెప్పుకున్నట్లు మహా ప్రవక్త (ﷺ)ను పట్టి తెచ్చినవారికి 100 ఎర్ర ఒంటెలు బహుమానం ఇస్తామని ప్రకటించారు ఖురైష్ నాయకులు. ఆ బహుమానం పట్ల దురాశ పెంచుకున్న సురాఖా బిన్ మాలిక్ వారిని వెంబడించాడు. అతను వారిని సమీపిస్తుండగా హఠాత్తుగా అతని అశ్వం ముందు కాళ్ళు నేలలో కూరుకుపోయాయి. ఇలా అనేక మార్లు జరిగింది. దాంతో సురాఖా భయభ్రాంతుడై, తాను ఓ అత్యంత శక్తివంతమైన దేవుడి ముందున్నానని గ్రహించి బుద్ధి తెచ్చుకున్నాడు. నిశ్చయంగా ముహమ్మద్ (ﷺ) వారు దేవుని సత్య ప్రవక్తని నమ్మాడు. మహా ప్రవక్త (ﷺ)ను మన్నించమని వేడుకున్నాడు. మహా ప్రవక్త (ﷺ) అతన్ని క్షమించి శరణమిచ్చారు. **"సురాకా! ఒక కాలం రానున్నది. అప్పుడు నీ రెండు చేతుల్లో కిస్రా కడియాలుంటాయి. అప్పుడు నీ వైభవం ఎలా ఉంటుందో ఒక్కసారి ఊహించుకో!"** అన్న భవిష్యవాణితో కూడిన శుభ వార్తను సయితం అందజేశారు. సురాఖా వచ్చిన దారిన తిరిగి వెళ్తూ, మధ్యలో తారసపడే వారందరినీ ప్రవక్త (ﷺ) ఈ దిశన వేళ్ళ లేదు అని నమ్మబలికి తనతో తీసుకెళ్ళాడు.

దైవప్రవక్త (ﷺ) అబూ బకర్ (ర)తో కలిసి చివరికి "ఖుబా" గ్రామానికి చేరు కున్నారు. ఇది మదీనా సమీపంలో ఉన్న గ్రామాల్లోని ఓ కుగ్రామం. దైవప్రవక్త (ﷺ) వారి ఖుబా గ్రామ రాక గురించి తెలుసుకున్న మదీనా (యస్రిబ్) ప్రజల ఓ పెద్ద సమూహం ఆయన్ను స్వాగతించడానికి తరలి వచ్చింది. ఆ రోజు వారికి పర్వదినంగా మారింది. మహా ప్రవక్త (ﷺ) ఖుబాలో నాలుగు రోజులు బస చేశారు. ఖుబా

పేరుతోనే ఓ మస్జిద్‌ను నిర్మించి అందులో నమాజు చేశారు. ఇది ఇస్లాంలో నిర్మిత మైన తొట్ట తొలి మసీదు. ప్రవక్త (ﷺ) ఖుబా గ్రామంలో ఉండగానే హజ్రత్ అలీ (ర) మక్కా నుండి హిజ్రత్ చేసి వచ్చి ఆయన్ను కలుసుకున్నారు. ఆయన మక్కాలో మూడు రోజులుండి ప్రవక్త (ﷺ), తనకు అప్పగించి వచ్చిన అమానతులన్నింటినీ ఆయా హక్కుదారులకు చేరవేసి మరీ ప్రవక్త చెప్పినట్లుగానే (కాలి నడకన) ఖుబా చేరుకున్నారు. ఖుబాలో నాల్గవ దినం తర్వాత యస్రిబ్‌లో ప్రవేశించారు ప్రవక్త (ﷺ). ఆ రోజు నుండి దాన్ని మదీనా అని నామకరణం చేశారు. దాన్నే 'మదీనతుర్రసూల్' (ప్రవక్త వారి పట్టణం) అని కూడా అంటారు. ఆ రోజు చరిత్రలోనే చిరస్థాయిగా నిలిచిపోయిన రోజు. అన్సార్ బాలికలు ఆనందోత్సాహంతో, అంతులేని సంతోషంతో గేయాలాపన చేస్తూ ప్రవక్త (ﷺ) వారిని ఘనంగా స్వాగతించారు.

**"మాపై పూర్ణ చంద్రుడు ఉదయించాడు**
**'వదా' పర్వత శిఖరాల మధ్య నుండి**
**అభినందనాలు, దైవానికి ధన్యవాదాలు**
**మాపై తప్పనిసరి. ప్రార్థించేవారు ప్రార్థించగా**
**మాలో ప్రభవించాడు. ఓ మహా మహిమాన్వితుడా!**
**నీ అమృత ప్రవచనాలే మాకు వీనుల విందు!!"**

ఇటు మదీనాలోని ప్రతి వ్యక్తీ ప్రవక్త (ﷺ) ముందుగా తమ ఆతిథ్యాన్నే స్వీకరించాలని, ఆ మహా భాగ్యం ముందుగా తమకే దక్కాలని ఆరాటపడసాగాడు. ప్రవక్త (ﷺ) అన్సార్ల వీధి గుండా నడుస్తూ ఉంటే ప్రతి గృహ యజమాని అభి మానంతో ఆయన ఒంటె త్రాడు పట్టుకోసాగాడు. ఆ విధంగానైనా ప్రవక్త (ﷺ) తమ ఆతిథ్యాన్ని స్వీకరిస్తారేమోనన్నది వారి ఆశ. ప్రవక్త (ﷺ) తమ ఆతిథ్యాన్ని స్వీకరించాలని మదీనాలోని ప్రతి కుటుంబం ఉవ్విళ్ళూరుతోంది. వారందరికీ ప్రవక్త (ﷺ) ఒకే మాట చెప్పారు. నా ఒంటె దారికి అడ్డు రాకండి. అది ఎక్కడికెళ్లాలో దానికి ఆదేశించబడి ఉంది. అలా ఆ ఒంటె ప్రస్తుతం మస్జిదె నబవీ ఉన్న ప్రదేశంలోకెళ్ళి కూర్చున్నది. ఆ స్థలానికి సమీపంలోనే 'అబూ అయ్యూబ్ అన్సారీ' (ర) గారి ఆనంద నిలయం ఉంది. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (ర) సంతోషంతో ఉబ్బితబ్బి బ్బవుతూ వచ్చి ప్రవక్త (ﷺ) గారిని ఇంటిలోపలికి తీసుకెళ్లారు.

ప్రవక్త (ﷺ) 'మదీనా మునవ్వరా' చేరుకున్న కొన్నాళ్ళకు ఆయన గారి సతీమణి హజ్రత్ సౌదా (ర), ఆయన గారి ఇద్దరు కూతుళ్లు – ఉమ్మె కుల్సూమ్ మరియు ఫాతిమా (ర)తోపాటు ఉమ్మె ఐమన్ (ర) కూడా మదీనా చేరుకున్నారు. అలాగే హజ్రత్ అబూ బకర్ (ర) గారి కుమారులు, ఇద్దరు కుమార్తెలైన హజ్రత్ ఆయిషా (ర) మరియు అస్మా (ర) సయితం మదీనాకు సురక్షితంగా చేరుకున్నారు. దీంతో ఇస్లాం సందేశ ప్రచారపు తొలి ఘట్టం సమాప్తమయింది.

# మదీనాలో నవ సమాజ సంస్థాపన

**వంశం, వర్ణం, జాతి, కులం లాంటి వ్యత్యాసాలు పూర్తిగా సమసి పోవాలన్నది ఈ సోదరీ కరణ ఉద్దేశ్యం. తోటి సోదరుని కోసం ప్రాణమైనా అర్పించటానికి సిద్ధపడిన అన్సార్లు చరిత్రపై చెరగని త్యాగ ముద్రను వేశారు. ప్రవక్త (ﷺ) ముహాజిర్ల – అన్సార్ల గుండెల్లో ప్రేమ విత్తనాలు నాటి, మానవత్వ మందా రాలు పూయించారు. వాటి గుభాళింపు అరబ్బు పరగణా అంతా వ్యాపించింది.**

ప్రవక్త (ﷺ) మదీనాలో నివాసమేర్పరచుకున్న తరువాత అన్నింటికంటే ముందు చేపట్టిన కార్యం మస్జిద్ నిర్మాణం. అబూ అయ్యూబ్ అన్సారీ (ర) గారి ఇంటికి సమీపంలో ఉండే ఇద్దరు అనాథల భూమిని రెట్టింపు వెలకట్టి సేకరించడం జరిగింది. ఈ మస్జిద్ నిర్మాణంలో స్వయంగా ప్రవక్త (ﷺ) రాళ్ళూ, ఇటుకలు మోసేవారు. మసీదు సమీపంలోనే ప్రవక్త (స)వారి సతీ మణుల కొరకు కుటీరాలు కూడా నిర్మించబడ్డాయి. నిర్మాణ పనులు పూర్తయ్యాక ప్రవక్త (ﷺ) అబూ అయ్యూబ్ అన్సారీ (ర) గారి ఇంటి నుండి ఇక్కడికి షిఫ్ట్ అయ్యారు. ఈ మసీదు 'ఖిబ్లా' మస్జిదె అఖ్సా దిశగా ఉండేది. ఈ మసీదు ఉత్తరాన ఒక ప్రక్కగా ఉన్న అరుగుని "సుఫ్ఫా" వారికని కేటాయించారు ప్రవక్త (ﷺ). వీరు కూడు, గూడు లేని నిరాధార జీవులు. మస్జిద్ కేవలం ప్రార్థనల కొరకే పరిమితం అవ్వలేదు. అది ఇస్లామీయ శిక్షణ పొందే, ధార్మిక విద్య గరిపే గొప్ప యూనివర్సిటీగా, ప్రజల సమస్యల్ని పరిష్కరించే ఓ మంచి పంచాయితీగా, సలహా సంప్రదింపులు జరిపే ఓ ఉత్తమ పార్లమెంట్‌గా, వివిధ తెగలకు చెందిన ముస్లింలంతా సమావేశమయ్యే అత్యున్నత కేంద్రంగా అలరారేది. ఈ నూతన వ్యవస్థాపకులు, నాయకులు స్వయంగా ప్రవక్త (ﷺ) వారే. దైవ ప్రవక్త(ﷺ) మదీనాకు వచ్చే నాటికి అక్కడ అనేక తెగలుండేవి. ఔస్, ఖజ్రజ్ – ఈ రెండు ప్రసిద్ధ అరబ్బు తెగలు. ఈ తెగలకు చెందిన అత్యధిక మంది ఇస్లాం స్వీకరించారు. వీరే 'అన్సార్'గా పిలువబడ్డారు. మదీనాలో నివసించే మరికొన్ని అరబ్బు తెగలు కూడా ఇస్లాంలో చేరాయి. కానీ వారి హృదయాల్లో మటుకు ప్రవక్త (ﷺ) గారి పట్ల, ఇస్లాం పట్ల విపరీతమైన ద్వేషం ప్రజ్వరిల్లుతూ ఉండేది. ఈ కపటుల నాయకుడు అబ్దుల్లాహ్ బిన్ ఉబై. మదీనాలో మూడో వర్గం కూడా ఉండేది. వారే యూదులు, వారిలో పేరు గాంచిన తెగలు బనూ ఖురైజా, బనూ నజీర్, బనూ ఖైనుఖా. వీరందరికి అరబ్బుల పొడ గిట్టేది కాదు.

వారంటేనే అసూయ, ద్వేషం. ధనలాలస, వడ్డీ లోలత్వంలో ఎంతటికైనా బరి తెగించే వారు. వీరు గొప్ప వ్యాపారస్తులు కూడా. అలాగే యూదులు అలజడులు సృష్టించ డంలో, తగవులు పెట్టి వేడుక చూడటంలో సిద్ధహస్తులు. "అరబ్బుల మధ్య చిచ్చు పెట్టి పని నెరవేర్చుకోండి – విభజించి పాలించు" అన్నది వారి రాజనీతి. ముస్లింల, యూదుల సమైక్యతను, శాంతి సామరస్యాలను ఆశించి ప్రవక్త (ﷺ) యూదులతో ఒప్పందం కుదుర్చుకున్నారు. కష్ట కాలంలో తాము ముస్లింలతోనే ఉంటామని యూదులు మాట కూడా ఇచ్చారు.

## ముస్లింల మధ్య 'సోదర బంధం'

మహా ప్రవక్త (ﷺ) చేపట్టిన బృహత్తర కార్యాల్లో ముహాజిర్లు (మక్కా నుండి వలస వచ్చిన వారు) అన్సార్ల (మదీనా వాసుల)కు మధ్య 'సోదర బంధం ఏర్పరచటం ఒకటి. ఇది మహా గొప్ప కార్య దీని ప్రకారం అనాగరికపు విషయాలను ప్రక్కనబెట్టి కేవలం ఇస్లాం సంరక్షణ కోసం పాటుపడాలి. వంశం, వర్ణం, జాతి, కులం లాంటి వ్యత్యాసాలు పూర్తిగా సమసి పోవాలన్నది ఈ సోదరీకరణ ఉద్దేశ్యం. తోటి సోదరుని కోసం ప్రాణమైనా అర్పించటానికి సిద్ధపడిన అన్సార్లు చరిత్రపై చెరగని త్యాగ ముద్రను వేశారు. ప్రవక్త (ﷺ) ముహాజిర్ల – అన్సార్ల గుండెల్లో ప్రేమ విత్తనాలు నాటి, మానవత్వ మందారాలు పూయించారు. వాటి గుభాళింపు అరబ్బు పరగణా అంతా వ్యాపించింది. ప్రవక్త (ﷺ) నాటిన ఆ దయాబీజం ప్రకారం ఓ ముస్లిం మరో ముస్లిం కు సోదరుడు. ఉదాహరణకు ముహాజిర్లలోని హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (ర)కి, అన్సార్లలోని హజ్రత్ సాద్ బిన్ రబీ (ర)కి మధ్య సోదరీకరణ చేశారు ప్రవక్త (ﷺ). సాద్ బిన్ రబీ (ర) తన ముహాజిర్ సోదరుడు అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (ర)తో ఇలా అన్నారు: "నేను గొప్ప ఆస్తిపాస్తులు గల శ్రీమంతుణ్ణి. నా ఆస్తిలో సగం మీది. అలాగే నాకు ఇద్దరు భార్యలున్నారు. వారిలో మీకు ఎవరు నచ్చితే నేనామెకు విడాకులిస్తాను. గడువు (ఇద్దత్) ముగిసిన తర్వాత మీరామెను వివాహం చేసుకోండి". అందుకు అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (ర) గారు– 'నా ప్రియ మిత్రుడా! అల్లాహ్ మీ సంపదలో, సంతానంలో మరిన్ని శుభాల్ని ప్రసాదించుగాక! నాకు అంగడి (బజారు)కెళ్ళే దారి చూపించండి చాలు' అని సోదరుని ప్రతిపాదనను సున్నితంగా త్రోసిపుచ్చారు. అలా బజారుకెళ్ళిన ఆయన అనతి కాలంలోనే వ్యాపారంలో అధిక లాభాల్ని గడించి, స్థానిక ముస్లింలలోనే గొప్ప ఆస్తిపరునిగా పేరు సంపాదించారు.

# బద్ర్ సంగ్రామం

**(సత్యానికి - అసత్యానికి మధ్య భీకర పోరు)**

**"దైవ సాక్షిగా చెబుతున్నాము. దైవ ప్రవక్తా! మీరు మమ్మల్ని తీసుకుని సముద్రంలో దూకినా మేమందుకు సిద్ధంగా ఉన్నాము. మాలోని ఏ ఒక్కడూ వెనుకంజ వేసేవాడు కాడు. మీరు తలచిన వారితో యుద్ధం చేయండి. అన్నింటికీ మేము సిద్ధమే".**

**హిజ్రీ 2వ సంవత్సరం** – మహా ప్రవక్త (ﷺ)కు, ముస్లింలకు మదీనాలో ఒక సురక్షితమైన ఇస్లామీయ కేంద్రం సంప్రాప్తమయింది. వారు ఇప్పుడు ఒక సంఘటిత సమాజంగా రూపొందారని తెలుసు కున్న ఖురైషులు తీవ్ర క్రోధావేశంతో చిందులేయ సాగారు. ముహాజిర్లను రకరకాలుగా భయపెట్ట నారంభించారు. ఈ కారణంగా అల్లాహ్ ముస్లిం లకు యుద్ధానుమతి ఇచ్చాడు. సిరియా నుండి తిరుగు ప్రయాణమై మదీనా మీదుగా వెళుతున్న ఖురైష్ వర్తక బృందాన్ని అడ్డుకోవాలన్న ఉద్దేశ్యంతో సమాయత్తమయ్యారు. (కారణం – ఈ బృందానికి నాయకుడైన అబూ సుఫ్యాన్ ఈ వ్యాపార లాభాన్ని ముస్లింలను, ఇస్లామీయ ఉద్యమాన్ని సర్వ నాశనం చేయడానికి ప్రత్యేకించబోతున్నానని ప్రకటించాడు.) 'అటు ముష్రికులు ఒకేసారి ముస్లింలందరినీ అంత మొందించాలన్న సంకల్పంతో మక్కా నుండి బయలు దేరారు' అన్న వార్త ముస్లింలకు చేరింది. ఈ కారణంగా కూడా ప్రవక్త (ﷺ) 313 మంది ముస్లిం యోధులను వెంటబెట్టుకుని ముష్రికులతో తాడో పేడో తేల్చుకోవడానికి సిద్ధమయ్యారు. సైనికు లందరికీ కలిపి రెండో, మూడో గుర్రాలు, డెబ్భయి ఒంటెలు మాత్రమే ఉన్నాయి. (సలహా సంప్రదింపుల తర్వాత) మహా ప్రవక్త (ﷺ) 'బద్ర్ బావి' దగ్గర గుడారాలు వేయమన్నారు. అటువైపు నుండి మక్కా ముష్కర మూక బయలుదేరింది. వారి సంఖ్య ఇంచు మించు 1300 ఉంటుంది. వారికి తోడుగా 100 గుర్రాలు, 700 లకు పైగా ఒంటెలున్నాయి. వారం దరికి నాయకుడు అబూ జహల్. వారంతా మక్కా నుంచి మదీనాకు బయలుదేరారు.

ముప్పు ముంచుకొస్తూ ఉంది అని గ్రహించిన ప్రవక్త (ﷺ) సహచరులందరినీ సమావేశపరచి సమాలోచన జరిపారు. "దైవ ప్రసన్నత కోసం, ధర్మ రక్షణ కోసం ప్రాణాలైనా త్యజించి పోరాడుతాం" అని ముహాజిర్లలోని ప్రతి వ్యక్తీ తన అభి ప్రాయాన్ని బాహాటంగా ప్రకటించాడు:

ఆ తర్వాత అన్సారులు ఇలా అన్నారు : "దైవ సాక్షిగా చెబుతున్నాము. దైవ ప్రవక్తా! మీరు మమ్మల్ని తీసుకుని సముద్రంలో దూకినా మేమందుకు సిద్ధంగా ఉన్నాము. మాలోని ఏ ఒక్కడూ వెనుకంజ వేసేవాడు కాడు. మీరు తలచిన వారితో యుద్ధం చేయండి. అన్నింటికీ మేము సిద్ధమే".

ముస్లింలంతా దైవ సమక్షంలో మోకరిల్లి సహాయం కొరకు కడు దీనంగా మొర పెట్టుకోసాగారు. ప్రవక్త (ﷺ) గారు దుఆ చేయడంలో ఎంతగా లీనమై ఉన్నారంటే, ఆయన భుజం మీద నుండి దుప్పటి జారి క్రిందపడిపోయిన ధ్యాస కూడా లేదు.

హిజ్రి శకం 2వ సంవత్సరం రమజాను నెల 17వ తేది ఉదయం వేళ రెండు సైన్యాలు ముఖాముఖి అయినాయి. మహా ప్రవక్త (ﷺ) ఆజ్ఞపై ముస్లిం యోధులు బారులు తీరి నిలబడ్డారు. ఒక్కొక్క వ్యక్తితో సమరం మొదలయింది. అల్లాహ్ ముస్లింలకు ఆకాశం నుండి మద్దతు పంపాడు. ముస్లిం యోధుల పంక్తుల మధ్య దైవ దూతలు సంచరించసాగారు. అవిశ్వాసుల గుండెల్లో గుబులు పుట్టింది. వారు భయకంపితులయ్యారు. మెల్లమెల్లగా వారు యుద్ధ మైదానం నుండి జారుకో సాగారు. వారి పరాజయ సూచనలు ప్రస్ఫుటంగా కన్పించసాగాయి. మిగిలినవారు ముస్లిం యోధుల ధాటికి నిలువలేక కాళ్ళకి బుద్ధి చెప్పారు. విజయం ముస్లింలకు వరించింది. సత్యం గెలిచింది. నిజమైన నిజం నెగ్గింది.

ఈ యుద్ధంలో అనేక మంది ఖురైషులు మరణించారు. వారిలో అబూ జహల్ ప్రముఖుడు. ఇతన్ని అన్సార్‌కి చెందిన ఇద్దరు కుర్రాళ్ళు వధించారు. హతులైన ఖురైషీ సైనికుల సంఖ్య 70కి చేరుకుంది. మరో 70మంది ఖైదీలయ్యారు. ముస్లింల లో 14మంది అమరగతులయ్యారు. యుద్ధ ఖైదీలను ప్రవక్త (ﷺ) మదీనా తీసు కెళ్ళారు. సహచరులంతా వారి ఎడల సహృదయంతో మెలిగారు. తర్వాత వారిలోని చాలా మందిని పరిహారం తీసుకుని వదిలేశారు. ఆ ఖైదీలలో ప్రవక్త (ﷺ) గారి పెదనాన్న అబ్బాస్ మరియు ప్రవక్త (ﷺ) కూతురు జైనబ్ (ర) భర్త అబుల్ ఆస్ కూడా ఉన్నారు. ప్రవక్త (ﷺ) తన కూతుర్ని మదీనా పంపాలన్న షరతుపై అతన్ని విడుదల చేశారు. ఇంకా కొంత మంది పరిహారం చెల్లించలేని నిరుపేదలున్నారు. అలాంటి వారు బంధ విముక్తి కోసం ఒక్కొక్కరు పదేసి మంది మదీనా బాలబాలికల కు చదవడం, వ్రాయడం నేర్పించాలని సూచించారు. యుద్ధం తర్వాత ప్రవక్త (ﷺ) సమర సొత్తు (మాలె గనీమత్)ను యుద్ధ వీరుల మధ్య పంచి పెట్టారు. దైవం నిర్ణయించిన 5వ భాగాన్ని దైవ ప్రవక్త (ﷺ) తీసుకున్నారు.

# ముఖ్య సంఘటనలు

హిజ్రీ శకం 2వ సంవత్సరంలో ముస్లింల ప్రార్థనా దిశ మస్జిదె అక్సా వైపు నుండి మస్జిదె హరామ్ వైపునకు మార్చబడింది. అదే సంవత్సరం రోజా (ఉపవాసం), జకాతుల్ ఫిత్ర్ (ఫిత్రా జకాతు), జకాతుల్ మాల్ (సంపద జకాతు) విధిగావించ బడ్డాయి. ఈ సంవత్సరంలోనే ముస్లింలు తొలిసారిగా ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) జరుపుకున్నారు. ఇక హిజ్రీ శకం 3వ సంవత్సరంలో హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (ؓ) గారి వితంతు అయిన కుమార్తె 'హఫ్సా' (ؓ)ను ప్రవక్త (ﷺ) వివాహ మాడారు. ఇంతకు మునుపే హజ్రత్ ఆయిషా (ؓ) గారితో ఆయన (ﷺ) వివాహం జరిగిందన్న విషయం విదితమే. ఈ రెండు సంబంధాల వల్ల అబూ బకర్ (ؓ), ఉమర్ (ؓ) గార్లతో ప్రవక్త (ﷺ) వారి సంబంధం మరింత పటిష్టమయ్యింది. అలాగే ప్రవక్త (ﷺ) గారి ప్రియ పుత్రిక హజ్రత్ ఫాతిమా (ؓ) గారి వివాహం హజ్రత్ అలీ (ؓ) గారితో జరిగింది. మరో కుమార్తె ఉమ్మె కుల్సూమ్ (ర) గారి వివాహం హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (ؓ) గారితో ఆమె అక్క రుఖయ్యా (ؓ) గారి మరణానంతరం జరిగింది. హజ్రత్ రుఖయ్యా (ؓ) కూడా ఉస్మాన్ (ؓ) గారి సతీమణియే. ఈ కారణంగానే ఆయన "జున్నూరైన్"గా పిలువబడ్డారు.

ఇప్పుడు మనం కాస్త గతాన్ని తరచి చూస్తే... అటు వైపు బద్ర్ యుద్ధంలో ఘోరంగా పరాజయం చవిచూసిన మక్కా విగ్రహారాధకులు అవమానంతో రగిలిపోతు న్నారు. క్రోధావేశాలతో ఊగిపోతున్నారు. యుద్ధ మైదానంలో కాకలు తీరిన పెద్ద పెద్ద నాయకుల మరణం వారి కంటికి కునుకు లేకుండా చేసింది. వారి హృదయాల్లో మండుతున్న ప్రతీకార నిప్పురవ్వలు రగులుకొని అగ్నిపర్వతంలా బద్దలయ్యే సమయం కూడా ఆసన్నమయ్యింది.

బద్ర్ – ఉహద్ యుద్ధాల మధ్య కాలంలో అనేక చిన్న చిన్న ఘర్షణలు జరిగాయి. కారణం – బద్ర్ యుద్ధానంతరం పొంచివున్న ప్రమాదాలు. ఈ ప్రమాదాలకు మూలం మొదట ఖురైషులు. వారు ముస్లింలపై పట్టరాని కోపంతో నల్లత్రాచుల్లా బుసలు కొడుతున్నారు. అదను చూసి దెబ్బ తీయాలని ఎదురు చూస్తున్నారు. మరో వైపు యూదులు కూడా తమ వంతు విగ్రహారాధకులను ఉసిగొల్పుతున్నారు. బద్ర్ సంగ్రామంలో ముస్లింలకు లభించిన విజయాన్ని, ప్రవక్త (ﷺ) తన సందేశామృతంతో ప్రజా బాహుళ్యాన్ని ఆకట్టుకుంటున్న తీరును చూసి – ఇది తమ ఆర్థిక, ధార్మిక రంగాలను దివాలా తీసేలా ఉందని గ్రహించి లోలోపలే ఉడుక్కున్నారు. అదే విధంగా కపటుల తరఫు నుండి పొంచివున్న ప్రమాదం కూడా తక్కువేం కాదు. కపటుల సర్దారు అబ్దుల్లా బిన్ ఉబై అప్పటికే ముస్లింల వెనుక గోతులు తవ్వటం మొదలెట్టాడు.

ఇక నాల్గవ వర్గం మదీనా చుట్టుప్రక్కల నివసించే జనపదాలు. విశ్వాసం, అవిశ్వాసం అన్నది వారికి అంత ముఖ్యం కాదు. వారు దోపిడీలు, దొంగతనాలకీ పాల్పడేవారు. ఇప్పుడు ముస్లింలకు లభించిన విజయం వల్ల వారికి ఓ విధమైనటువంటి భయం చుట్టుముట్టింది. మదీనాలో గనక ఓ పటిష్టమైన ప్రభుత్వం ఏర్పడితే తమ ఆటలు సాగవని భయపడి వారు కూడా ముస్లింలను ద్వేషించనారంభించారు. అలా వారు సయితం ముస్లింలకు బద్ధశత్రువులుగా మారారు.

# ఉహద్ సంగ్రామం

**అవిశ్వాసుల సైన్యం మూడు మార్లు ఖాలిద్ బిన్ వలీద్ నాయకత్వంలో వెనుక నుండి దొంగ దెబ్బ తీయాలనీ, ముస్లిముల సైన్యాన్ని ఛిన్నా భిన్నం చేయాలని ప్రయత్నిం చింది. కాకపోతే ప్రవక్త(ﷺ) నియమించిన ఆ యాభై మంది విలు కాండ్రు ఎంతో అప్రమత్తంగా ఉండి అవిశ్వాసుల ప్రయత్నాలన్నింటినీ తుంగలో త్రొక్కేశారు. విగ్రహారాధకుల ధ్వజం నేలకొరిగింది. వారి ధైర్య సాహసాలు నీరుగారాయి. కాని సరిగ్గా అదే సమయంలో.....!?**

**బద్ర్** రణ భూమిలో హతులయిన మక్కా నాయకుల అనుయాయులు ప్రతీకారం తీర్చుకోవటానికి ఎదురు చూస్తున్నారు. అందుకే ముస్లిములకు వ్యతిరేకంగా ఖురైషులు రాత్రింబవళ్ళు యుద్ధ సన్నాహాలు చేయసాగారు. దాదాపు మూడు వేల మంది సైన్యంతో యుద్ధం కోసం సన్నద్ధులయ్యారు. కొంత మంది స్త్రీలను కూడా తోడు తీసుకున్నారు. ఇలా పురుషులను పురిగొల్పడానికి వారు మంచి సాధనం అన్నది వారి నమ్మకం. అలా వారు మదీనా వైపునకు బయలుదేరారు. అయితే ప్రవక్త (ﷺ) వారిని ఎదుర్కొనేందుకు సిద్ధంగా లేరు.

కానీ ప్రవక్త (ﷺ) గారి పినతండ్రి అబ్బాస్ (ర) గారు పంపిన రహస్య లేఖ ఖుబాలో వున్న మహాప్రవక్త(స)కు అందింది. ప్రవక్త (ﷺ) తక్షణమే మదీనా చేరుకున్నారు. అక్కడ ముహాజిర్లను, అన్సార్లను సమావేశపరచి, తాము అవలంబించవలసిన రణనీతిపై సలహా సంప్రదింపులు కూడా జరిపారు. అలాగే తమ వంతు కృషి తాము చెయ్యాలనీ, ధర్మపోరాటం (జిహాద్) కోసం సిద్ధంగా ఉండాలనీ, దానికి సరిపడా సామగ్రిని కూడా కూడబెట్టుకోవాలని హితోపదేశం చేశారు. మదీనాలోనే వుండి ముష్రికులను ప్రతిఘటించాలన్నది దైవప్రవక్త (ﷺ) వారి అభిమతం. దీన్ని కొంత మంది సమర్ధించారు. అయితే చాలా మంది "నగరం బయటకెళ్ళి శత్రువుల్ని ఎదుర్కొందాం ప్రవక్తా!" అని పట్టుబట్టారు. ప్రవక్త (ﷺ) కూడా వారి అభిప్రాయాన్నే అంగీకరించారు.

మహాప్రవక్త (ﷺ) వెయ్యి మంది యోధులతో మదీనా పొలిమేరల్లోనున్న “ఉహద్” గుట్టల వైపునకు బయలుదేరారు. కొంత దూరం వెళ్ళాక అబ్దుల్లాహ్ బిన్ ఉబై అనే కపటి 300 మందిని తన పక్షాన మరల్చుకుని తతిమ్మా సహాబాతో వేరయ్యాడు. ఇలా జరుగుతుందని గ్రహించిన ప్రవక్త (ﷺ) “మదీనాలోనే ఉండి పోరాడదాం” అన్న అతని అభిప్రాయాన్ని అంగీకరించలేదు. అలా గనక జరిగివుంటే సైన్యంలో చిచ్చు పెట్టి తాను చిందులేసేవాడు గనుక. ఇక ప్రవక్త(స) మరియు మిగిలిన 700 మంది సైన్యం అల్లాహ్ మీద భారం వేసి, ఉహద్ గుట్టపై మకాం వేసిన అవిశ్వాసుల సైన్యం వైపు ముందడుగు వేశారు. మహా ప్రవక్త (ﷺ) తన సైన్యం ముందు వైపు మదీనా ఉండేటట్లు, వెనుక వైపు ఉహద్ పర్వతం ఉండేటట్లు, సైన్యాన్ని నియమించారు. వారి పంక్తుల్ని సరిచేశారు. వారిలోని యాభై మంది విలుకాండ్రను ఎంచుకొని, సైన్యం వెనుక వైపున ఒక కనుమలో మోహరించారు. అక్కడ్నుంచి శత్రువు దాడి జరగకుండా కాపాడుతూ వుండాలి అని వారిని ఆదేశించారు. పరిస్థితులు ఎలా వున్నాసరే నేను పిలవనంతవరకు మీరు మీ చోటునుండి ఒక్క అడుగు కూడా కదల కూడదు. నూరు ఆరైనా, ఆరు నూరైనా మీరు మాత్రం ఆ స్థానాన్ని వదలి పెట్ట కూడదు అని తాకీదు చేశారు.

దైవప్రవక్త (ﷺ) తన సైన్యానికి జిహాద్ ఔన్నత్యం గురించి ఉపన్యాసం ఇస్తూ వారిలో నూతనోత్సాహాన్ని నింపారు. చేతిలో కరవాలం పట్టుకుని, “ఈ కరవాలం హక్కును నూటికి నూరుపాళ్ళు ఎవరు నెరవేరుస్తారు?” అని తన అనుచరులకు పిలుపునిచ్చారు.“మేము మేము” అంటూ అనేకులు ముందుకొచ్చారు. హజ్రత్ అబూ దజానా (ర) మాత్రం నిలబడి “ఓ దైవప్రవక్తా (ﷺ)! దీని హక్కు ఏమిటి?” అని వివరణ కోరారు. అప్పుడు ప్రవక్త (ﷺ) “ఈ కరవాలం వంకర అయ్యే వరకు దీంతో శత్రువులపై దాడి చెయ్యాలి” అన్నారు. “అయితే దీన్ని నాకు ప్రసాదించండి దైవప్రవక్తా!” అన్నారు అబూ దజాన (ర). ఆయన(ﷺ) తన ఖడ్గాన్ని అబూ దజానా (ర)కు ఇచ్చారు. అబూ దజానా (ర) ఆ ఖడ్గం పట్టుకుని శత్రుసేనలలో వారి పంక్తుల్ని చీల్చుకుంటూ చొచ్చుకుపోయారు. యుద్ధం ఊపందుకుంది. భీకర పోరాటం జరుగుతోంది. అబూ దజానా (ర) ప్రవక్త (ﷺ) గారి కరవాలంతో అవిశ్వాసులపై విరుచుకుపడ్డారు. ఎదురవుతున్న ఎంతటి యోధుడ్ని అయినా ఇట్టే మట్టి కరిపిస్తున్నారు. ఇటు హజ్రత్ హమ్జా (ర) శత్రువులతో హోరాహోరీ పోరాటం సాగిస్తూ జుబైర్ బిన్ ముత్యిమ్ బానిస అయిన వహ్షీ బిన్ హరబ్ (నీగ్రో బానిస) చేతిలో మరణించారు. గతంలో బద్ర్ యుద్ధంలో హజ్రత్ హమ్జా (ర) జుబైర్ పినతండ్రిని వధించారు. కనుక నువ్వు గనక హమ్జాను హతమారిస్తే నిన్ను బానిసత్వం నుండి విముక్తి కలిగిస్తానని జుబైర్ ఆ నీగ్రో బానిసకి ఎర వేశాడు. తనకు స్వేచ్ఛ లభిస్తుందన్న ఆశతో అతను హమ్జా గారినే తన లక్ష్యంగా పెట్టుకుని చివరికి అదను చూసి ఆయన్ని హతమార్చాడు.

వాస్తవంగా ప్రవక్త (ﷺ) గారి పెదనాన్న హమ్జా(ర) మరణం వల్ల ముస్లిములకు పెద్ద నష్టమే జరిగింది. అయినప్పటికీ ముస్లిములు దృఢ సంకల్పంతో తమ తమ స్థానాల్లో నిలకడగానే వున్నారు. అవిశ్వాసుల సైన్యం మూడు మార్లు ఖాలిద్ బిన్ వలీద్ నాయకత్వంలో వెనుక నుండి దొంగ దెబ్బ తీయాలనీ, ముస్లిముల సైన్యాన్ని ఛిన్నా భిన్నం చేయాలని ప్రయత్నించింది. కాకపోతే ప్రవక్త (ﷺ) నియమించిన ఆ యాభై మంది విలుకాండ్రు ఎంతో అప్రమత్తంగా ఉండి అవిశ్వాసుల ఈ ప్రయత్నాలన్నింటినీ తుంగలో త్రొక్కేశారు. ఈ విధంగా తొలి దశలో ముస్లిములదే పైచేయి అయింది. విగ్రహారాధకుల ధ్వజం నేలకొరిగింది. వారి ధైర్యసాహసాలు నీరుగారాయి. ఇలా మరోసారి వెనుక నుండి దాడి చేయటానికి వారిలో ఏ ఒక్కరూ సాహసించలేక పోయారు. కాని సరిగ్గా అదే సమయంలో.....!?

## ఐహిక లాలస అనర్థదాయకం

**ఉత్బా కుమార్తె 'హిందా' అంటారా – కనికరం లేని ఈ కసాయి స్త్రీ హజ్రత్ హమ్జా (ర) గారి గుండెకాయను బయటికి లాగి దాన్ని నిర్దయంగా కసకస నమిలింది. అయితే మింగలేక బయటికి కక్కేసింది. ఆ తర్వాత తనివి తీరని కసితో ముస్లిం మృత దేహాల ముక్కు చెవుల్ని మాలగా చేసుకొని మెడలో వ్రేలాడదీసుకుంది ఆ కర్కశ హృదయురాలు.**

విజయం తమను వరించిందని భావించిన ముస్లింలు విజయ ధనాన్ని సేకరించడానికి ఎగబడ్డారు. వారిలో వారికి తెలియకుండానే ప్రాపంచిక వ్యామోహం చోటు చేసుకుంది. అటు కొండ మీద ఉన్న విలుకాండ్రులతోనైతే జరగరాని పొరపాటే జరిగింది. ఈ చిన్న తప్పిదం వల్ల కాసేపటి క్రితం విజయం తమ సొంతం అని ఆత్మ స్తుతికి పోయిన ముస్లింలు ఘోర పరాభవాన్ని, పరాజయాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఈ మైనర్ తప్పిదం వల్లనే ప్రవక్త (స) కూడా మృత్యు చెందారన్న వదంతులు వ్యాపించాయి. ఈ రూమర్స్ విన్న ముస్లింలలో నిరాశానిస్పృహల కారు మేఘాలు క్రమ్ము కున్నాయి. ఇది ఎలా జరిగిందంటే..? గుట్ట కనుమపై ఉన్న విలుకాండ్రు, ముస్లిం సైనికులు యుద్ధ ప్రాప్తి పోగు చేస్తూ ఉండటం చూసి ప్రాపంచిక ప్రలోభానికి లోనై వారు ఎంతో కీలకమైన తమ స్థానాన్ని వదలి యుద్ధ ఫలం సేకరించేం దుకు పరుగులు తీశారు. వారి వల్ల జరిగిన ఈ చిన్న పొర పాటును అంది వచ్చిన అవకాశంగా భావించిన ఖాలిద్ బిన్ వలీద్ ఆలస్యం చేయకుండా తన అధీనంలో ఉన్న సైన్యం తో గుట్టను ముట్టడించి కనుమ దగ్గరకి – అంటే సైన్యం వెనుక వైపు చేరుకున్నారు. వీరంతా కలిసి ముస్లింలపై ముందు వైపు నుండి, వెనుక వైపు నుండి ఒక్క సారిగా మెరుపు దాడి చేశారు. నలుదిక్కుల నుండి ముస్లింలను చుట్టుముట్టారు.

అప్పుడు దైవప్రవక్త (ﷺ) ముస్లిం సైన్యంలో చివర్లో ఉన్నారు. ఆయన ఈ హఠాత్పరి ణామానికి దిగ్భ్రాంతి చెందారు. ఇప్పుడు ఆయన (ﷺ) ముందు రెండే రెండు మార్గాలున్నాయి.

1) సమయ స్ఫూర్తితో వ్యవహరించి తన్ను తాను రక్షించుకోవడానికి సైన్యాన్ని వదిలి ఏదైనా సురక్షితమైన చోటుని ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా ఆశ్రయించడం.

2) ముంచుకొస్తున్న ప్రమాదాన్ని ధైర్యంతో ఎదుర్కొంటూనే తన సైన్యాన్ని తన చుట్టూ సమైక్యపర్చడం. ఇక్కడ దైవప్రవక్త (ﷺ) గొప్ప సాహసాన్నే ప్రదర్శించారు. తన సహచరుల్ని పిలవనారంభించారు. అటు ముస్లింలలోని కొందరు ఆత్మ స్థయిర్యాన్ని కోల్పోయి చెల్లాచెదురై మదీనాకు పారిపోయారు. ఈ భీకర పోరాటంలో సయితం ప్రవక్త (ﷺ)ను రక్షించడానికి ఆయన చుట్టూ గుమిగూడిన ముస్లిం యోధులు గొప్ప ధైర్య సాహసాల్ని ప్రదర్శించారు. ఈ యుద్ధంలో ప్రవక్త (ﷺ) గారి రెండు పల్లు విరిగి పోయాయి. అంతేకాక ప్రవక్త (ﷺ) అమరగతులయ్యారనే ప్రాపగాండ ప్రచారం చేయడం జరిగింది.

మహా ప్రవక్త (ﷺ) కోసం ప్రాణాలు పణంగా పెట్టి పోరాడిన ధీరోత్తముల్లో హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (ర), హజ్రత్ అబూ దుజాన (ర) మరియు హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (ర), హజ్రత్ తల్హా (ర)లు ప్రముఖులు. ఎందుకంటే – ఎలాగైనా దైవప్రవక్త (ﷺ)ను అంతమొందించాలన్నది విగ్రహారాధకుల ప్రథమ లక్ష్యం. అయితే ప్రవక్త (ﷺ) గారి చుట్టూ ఉన్న ముస్లిం యోధుల ఎదురు దాడికి తట్టుకోలేక తిరుగు ముఖం పట్టారు అవిశ్వాసులు. ఈ రణరంగంలో ముస్లిం అమరగతుల సంఖ్య 70కి చేరుకుంది. మృతి చెందిన ముస్లింల శరీరావయవాలను విగ్రహారాధకులు 'ముస్లా' చేయనారంభించారు. అంటే – మృతుల చెవులు, ముక్కు కోయడంతోపాటు వారి కడుపులను చీల్చి పైశాచికానందంతో చిందులేయసాగారు. ఇక ఉత్బా కుమార్తె 'హిందా' అంటారా – కనికరం లేని ఈ కసాయి స్త్రీ హజ్రత్ హమ్జా (ర) గారి గుండెకాయను బయటికి లాగి దాన్ని నిర్దయంగా కసకస నమిలింది. అయితే మింగలేక బయటికి కక్కేసింది. ఆ తర్వాత తనివి తీరని కసితో ముస్లిం మృత దేహాల ముక్కు చెవుల్ని మాలగా చేసుకొని మెడలో వ్రేలాడదీసుకుంది ఆ కర్కశ హృదయు రాలు. ఇదే ఆ ఉహద్ రణరంగం. ఇది ముస్లింల పాలిట పరాజయమా! కాదా? అన్న విషయానికి వస్తే – చివర్లో విగ్రహారాధకుల సైన్యానిదే పైచేయి అన్నది నిర్వివాదాంశం. అలాగే ప్రాణ నష్టం కూడా ముస్లింలకే ఎక్కువ జరిగిందన్నది కూడా నిప్పు లాంటి నిజమే. అయితే మక్కా సైన్యం ముస్లింల సైన్యాన్ని పూర్తిగా ఓడించలేక పోయిందన్నది కూడా అక్షర సత్యమే. ప్రవక్త (ﷺ)ను కాపాడుతూ పవిత్ర విశ్వాసంతో పోరాడిన వారి అసామాన్య ధైర్య సాహసాలు, అనుపమాన త్యాగాలు చరిత్రను మరోసారి తిరగ వ్రాసాయి.

ఉహద్ యుద్ధానంతరం ప్రవక్త (ﷺ) ఖుజైమా కుమార్తె హజ్రత్ జైనబ్ (ర) అనే వితంతువును మనువాడారు. ఆమె భర్త ఉహద్ సంగ్రామంలో అమరగతులయ్యారు. పుణ్య కార్యాల పట్ల ఆమెకున్న శ్రద్ధ వల్లనే ఆమెను "ఉమ్ముల్ మసాకీన్" (పేదల పెన్నిధి) అని పిలిచేవారు. ప్రవక్త (స)తో వివాహానంతరం మూడు నెలల్లోనే ఆమె పరమపదించారు. ఆ తర్వాత దైవ ప్రవక్త (ﷺ) ఉమ్మె సలమా (ర)ను, ఆమె భర్త అబూ సలమా మరణానంతరం వివాహమాడారు. ఇస్లాం ఉన్నతి కోసం దైవ మార్గంలో అనేక త్యాగాలు చేసిన మహిళామణి ఆమె.

## కందక పోరాటం
### (హిజ్రి శకం 5)

**ఈ ముట్టడి నాలుగు వారాల వరకు కొన సాగింది. అయినా వారి విశ్వాసంలో ఇసుమంతైనా తేడా రాలేదు. వారిలోని విశ్వాస జ్యోతి తైలం లేకుండా మండుతూ ఉండే అఖండ జ్యోతిలా ప్రజ్వరిల్లుతూనే ఉంది. వారిలోని ధైర్యసాహసాలు అణు మాత్రం కూడా సన్నగిల్ల లేదు. వారికి అల్లాహ్‌పై మరింత విశ్వాసం పెరిగింది. అల్లాహ్ తమను ఎన్నటికీ వృధా చెయ్యడు అన్న బలమైన నమ్మకం వారిలో చోటు చేసుకుంది.**

ఉహద్ ఓటమి వల్ల ముస్లింల ప్రతిష్ఠ దెబ్బ తిన్నది. ఇంటా బయటా వారు అనేక సమస్యలు, సవాళ్లను ఎదుర్కోవాల్సి వచ్చింది. ఈ మధ్య కాలంలో మదీనాపై బనూ సఅద్ దాడి వల్ల 10 మంది సహాబీలు ప్రాణాలు కోల్పోయారు కూడా. అటు యూదులు తేనె పూసిన కత్తుల్లా వ్యవహరిస్తూ రహస్య కుట్రలు పన్నసాగారు. ఓ ముస్లిం మహిళను అవమానపర్చిన సంఘటనలో హతులైన బనూ కిలాబ్‌కి సంబంధించిన ఇద్దరు వ్యక్తుల రక్త పరిహారాన్ని కోరేందుకు వెళ్ళిన దైవ ప్రవక్త (స)ను గోడపై నుండి బండ రాయిని దొర్లించి చంప జూశారు. అల్లాహ్ అభీష్టం మేరకు ప్రవక్త (స) ఆ గండం నుండి బయట పడ్డారు. ఆ తర్వాత ముందు చేసుకున్న ఒడం బడిక ప్రకారం యూదుల తెగ బనూ నజీర్ మదీనా వదలి వెళ్ళిపోవలసిందిగా ఫర్మానా జారీ చేశారు. అయితే ఈ తీర్పును వాళ్ళు పెడచెవిన పెట్టారు. తత్కార ణంగా హిజ్రీ శకం 4 రబీవుల్ అవ్వల్ మాసంలో బనూ నజీర్‌పై సైనిక చర్య అనివార్యమయింది. చివరికి యూదులను మదీనా నుండి బహిష్కరించడం జరిగింది. ఈ సంఘటన 'అల్ హష్ర్' సూరాలో ప్రస్తావించ బడింది.

ఓ ఏడాది కాలం పాటు సైనిక చర్యలు జరిపిన తర్వాత ఇప్పుడు మదీనాలో కాస్తంత ప్రశాంత వాతావరణం నెల కొన్నది. గతంలో సంభవించిన అవాంఛనీయ సంఘట నల మూలంగా కలిగిన బాధలను మరచిపోయి సంతృప్త హృదయాలతో జీవితం గడప సాగారు ముస్లింలు.

అయితే మదీనా నుండి పోయి, ఖైబర్ చేరుకున్న యూదులు ముస్లింలకు వ్యతిరేకంగా భయంకర కుట్రలు పన్నసాగారు. ముస్లింలను నామ రూపాల్లేకుండా అంతమొందించాలని సన్నాహాలు చేయ సాగారు. యూదులకు చెందిన 20 మంది ప్రముఖులు మక్కా వెళ్ళి ఖురైషులను ప్రవక్త ﷺ గారితో పోరా టానికి సమాయత్తం చేశారు. అలాగే చుట్టుప్రక్కల ఉండే అరబ్బు తెగల్ని కూడా ముస్లింలకు వ్యతిరేకంగా ప్రేరేపించారు. వారి ఈ పాచికలు బాగానే పారాయి. ఈ సైన్యాలన్నీ కలిసికట్టుగా మదీనా వైపు బయలు దేరాయి. మరికొన్ని రోజుల్లోనే 10 వేల మంది మదీ నాను ముట్టడించబోతున్నారన్న సమాచారం తెలుసు కున్న ప్రవక్త ﷺ మదీనాను రక్షించడానికి తన సహా బాలతో సమాలోచన జరిపారు. అప్పుడు మదీనా చుట్టూ కందకం తవ్వాలన్న హజ్రత్ సల్మాన్ ఫారసీ (ర) గారి సలహాను అందరూ సమర్థించారు.

ఈ కందకం త్రవ్వడం కోసం పగలు రాత్రి ఒకటి చేసి శ్రమించారు ముస్లింలు. ప్రవక్త ﷺ తన సహచరులను ప్రోత్సహిస్తూ స్వయంగా వారితోపాటు పనిలో పాల్గొ న్నారు. ఎంతో ఆకలితో ఉండి కూడా కళ్ళు లోపలికి పీక్కుపోయినా, పొట్ట వీపుకి అతుక్కుపోయినా ఉత్సాహంగా పని చేస్తున్నారు ముస్లింలు. ఈ కందకం త్రవ్వే సందర్భంలో దైవ దౌత్యపు మహిమలు కొన్ని సంభవించాయి. అనేక మంది ఆకలితో నకనకలాడటం చూసి హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (ర) ఓ మేకను జిబహ్ చేశారు. ఆయన గారి సతీమణి రొట్టెలు తయారు చేశారు. ఆ తర్వాత ప్రవక్త ﷺ తనతోపాటు కొందరిని మాత్రమే తీసుకు రావలసిందిగా కబురు పంపారు. కాని ప్రవక్త ﷺ కందకంలో పనిచేసే వారందరిని, అంటే దాదాపు వేయి మందిని వెంటబెట్టుకొచ్చారు. ఆ జన సమూహాన్ని చూసి కంగారు పడ్డారు జాబిర్ (ర). అయితే ఆయన గారి సతీమణి ఈ సందర్భంగా తమ అచంచలమైన విశ్వాసాన్ని చాటుకుంది. "దైవ ప్రవక్త ﷺ తమతోపాటు అంత మందిని తీసుకు వస్తున్నారంటే దైవం తరఫున ఏదైనా ఏర్పాటు జరిగే ఉంటుంది" అని అభయమిచ్చారు. జాబిర్ (ర) కాస్త కుదుట పడ్డారు. అక్కడ ప్రవక్త ﷺ గారి చేతుల మీద దైవం చూపించిన మహిమ (మోజిజా)తో వచ్చిన ఆ వేయి మంది కూడా కడుపు నిండా భోంచేశారు. అయినా రొట్టెలు, మాంసం ఏ మాత్రం తరగలేదు సరికదా పెరుగుతూనే ఉంది.

ఈ కందకం త్రవ్వే సందర్భంలోనే విశ్వాస బాంధవి అయిన ఓ స్త్రీమూర్తి కొన్ని ఖర్జూరాలు తీసుకొచ్చింది. ప్రవక్త ﷺ ఆ ఖర్జూరాలు తీసుకొని ఓ గుడ్డపై వేసి కందకం త్రవ్వే వారందరినీ ఆహ్వానించారు. వారందరూ వచ్చి తినడం ప్రారం భించారు. అటు వాళ్ళు తింటుంటే ఇటు ఖర్జూరాలు విచిత్రంగా పెరుగుతూనే ఉన్నాయి. అలా వాళ్ళంతా కడుపార తిన్నారు. ఇది కూడా ప్రవక్త ﷺ గారి మహిమ తోనే జరిగింది.

ఖురైషులు నాలుగు వేల మంది సైనికులతోను, మిగిలిన తెగలు 6 వేల మంది సైనికులతోనూ కదన రంగానికి కదలి వచ్చారు. వారందరూ ఉహద్ కొండ సమీపంలో మోహరించారు. ఇటు మహా ప్రవక్త (ﷺ) 3 వేల మంది ముస్లిం యోధులతో సమరానికి సిద్ధమయ్యారు. ముస్లిం సైన్యానికీ – అవిశ్వాస సేనలకి మధ్య కందకం ఉంది. అవిశ్వాస దళాలు ఒకదాని వెంట మరొకటిగా రహస్యంగా బయలుదేరాయి. కానీ తీరా మదీనా సమీపానికి చేరుకున్నాక అక్కడ కొత్తగా వెలిసిన కందకాన్ని చూసి కొయ్యబారిపోయారు. ఈ కందకాన్ని ఎలా దాటాలా అని పరిపరి విధాల ఆలోచించసాగారు. ఆ కందకం చుట్టు తిరుగుతూ ఏ కాస్త సందు దొరికినా జొరబడటానికి తెగ ప్రయత్నిస్తున్నారు. వారు లోనికి దూరేందుకు ప్రయత్నించి నప్పుడల్లా అటు వైపు నుంచి ముస్లిం యోధులు శర పరంపరలను ఎడతెరిపి లేకుండా సంధిస్తున్నారు. ఆ బాణాల వర్ష ధాటికి తట్టుకోలేక, కందకాన్ని దాటలేక శత్రువులు అవతలి ఒడ్డునే తిష్ఠ వేశారు. ఈ ముట్టడి నాలుగు వారాల వరకు కొన సాగింది. ఇటు మదీనాలో ఆహార సామగ్రి కొరవడింది. అయినా వారి విశ్వాసంలో ఇసుమంతైనా తేడా రాలేదు. వారిలోని విశ్వాస జ్యోతి తైలం లేకుండా మండుతూ ఉండే అఖండ జ్యోతిలా ప్రజ్వరిల్లుతూనే ఉంది. వారిలోని ధైర్యసాహసాలు అణు మాత్రం కూడా సన్నగిల్ల లేదు. వారికి అల్లాహ్‌పై మరింత విశ్వాసం పెరిగింది. అల్లాహ్ తమను ఎన్నటికీ వృధా చెయ్యడు అన్న బలమైన నమ్మకం వారిలో చోటు చేసుకుంది. చివరికి 27వ రోజు రాత్రి అల్లాహ్ సహాయం రానే వచ్చింది.

పరిస్థితి మరింత విషమించిందన్న విషయాన్ని పసిగట్టిన ముస్లింలు సహాయం కోసం అల్లాహ్‌ను అర్థించారు. దైవ ప్రవక్త (ﷺ) సయితం ఈ ఆపదను తొలగించ మని కడు దీనాతిదీనంగా వేడుకున్నారు. అల్లాహ్ వారి మొరను ఆలకించాడు. ఒక్కసారిగా తుఫాను గాలులు వీయడం ప్రారంభమయింది. అల్లాహ్ తీవ్రమైన గాలి దుమారాన్ని అవిశ్వాసుల పాలిట శిక్షగా పంపాడు. అవిశ్వాసుల గుడారాలన్నీ గాలి దెబ్బకు ఎగిరిపోయాయి. అవిశ్వాస దళంలో కలకలం రేగింది. అల్లాహ్ వారి గుండెల్లో గుబులు పుట్టించాడు. ఆ తర్వాత వారు అల్లాహ్ శిక్షకు తాళలేక మదీనా నుండి తోక ముడిచారు. ఈ యుద్ధంలో అవిశ్వాసులు అనేక విధాల నష్టపోవడంతో పాటు ఘోర పరాభవానికి గురయ్యారు. మానవ చరిత్రలో అసత్యం మూట కట్టుకునేది అపకీర్తినే తప్ప సుకీర్తిని కాదు అన్న విషయాన్ని ఈ యుద్ధం మరొక్క మారు నిరూపించింది. అధర్మాన్ని మట్టి కరిపించి ధర్మాన్ని నాలుగు పాదాల నడిపిం చిన ఓ అద్భుత మైలురాయిగా ఈ యుద్ధం చరిత్రకెక్కింది.

హిజ్రీ శకం 5వ సంవత్సరంలో ప్రవక్త (ﷺ) జైనబ్ బిన్తె జహష్ (ర)ను వివాహ మాడారు. ఈమె దైవ ప్రవక్త (ﷺ) వారికి స్వయాన మేనత్త కూతురు. జైనబ్ (ర)

వివాహం మొదట ప్రవక్త (ﷺ) పెంపుడు (దత్త) పుత్రుడు అయిన హజ్రత్ జైద్ బిన్ హారిసా (ర)తో జరిగింది. అంతకు ముందు జైద్ (ర) బానిసగా జీవితం గడిపారు. ఈ యుద్ధం (గజ్వయె అహ్జాబ్) తర్వాత ఇస్లాం ప్రచారం నిమిత్తం అనేకమంది రాయబారుల్ని భిన్న తెగల వద్దకు పంపడం జరిగింది. అలాగే ఈ మధ్య చిన్నాచితకా పోరాటాలు, సైనిక చర్యలు కూడా జరిగాయి. ఆ దరిమిలా హిజ్రి శకం 6వ సంవత్సరంలో ప్రవక్త (ﷺ) 'జువైరియా బిన్తె హారిస్ (ర)'ను మనువాడారు.

## హుదైబియా ఒప్పందం (హిజ్రీ శకం - 6)

అరేబియా ద్వీపకల్పంలోని పరిస్థితులు ముస్లింలకు అనుకూలంగా రూపొంద సాగాయి. తత్ఫలితంగా ఇస్లామీయ సందేశం సర్వవ్యాప్తమయ్యే సూచనలు కాన రాసాగాయి. మస్జిదె హరామ్‌లో ముస్లింలకు ప్రార్థన చేసే హక్కు ఎంతైనా ఉంది అన్న అభిప్రాయం బలబడసాగింది. ఒక రోజు రాత్రి దైవ ప్రవక్త (ﷺ) తన సహ చరులతో మస్జిదె హరామ్‌లో ప్రవేశిస్తున్నట్లు కలగన్నారు. ఈ కలను సహచరులకు సయితం విన్పించారు. ఈ వార్త విని వారందరూ ఆనందపరవశులయ్యారు. ఆ తర్వాత ప్రవక్త (ﷺ) తాను ఉమ్రా సంకల్పంతో ఉన్నానని తెలియజేశారు. ఇది విన్న సహచరులు కూడా అదే శుభ సంకల్పంతో ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. 1500 మంది ముస్లింలు మహా ప్రవక్త (ﷺ) వారి సారథ్యంలో మక్కా బయలుదేరారు. అలా బయలు దేరినవారు 'హుదైబియా' అనే ప్రాంతానికి చేరుకొని ఆగిపోయారు. ఈ ప్రాంతం మక్కా నగరానికి కాస్త చేరువలో ఉంది.

ప్రవక్త (ﷺ) గారి రాక గురించి తెలుసుకున్న ఖురైషులు ఎలాగైనాసరే ముస్లింలను బైతుల్ హరాంలో ప్రవేశించకుండా ఆపాలని నిర్ణయించుకున్నారు. ముందు జాగ్రత్త చర్యగా 700 మంది సైనికులను ఖాలిద్ బిన్ వలీద్ నేతృత్వంలో సమాయత్త పరచి పంపారు. ముస్లింలు అస్ర్ నమాజు చేస్తూ ఉండగా హఠాత్తుగా వారిపై విరుచుకు పడాలని పథకం వేసుకున్నారు. అయితే 'సలాతుల్ ఖౌఫ్' (భయం, యుద్ధం సమయాల్లో చేసే నమాజు) ఆదేశాన్ని అల్లాహ్ అవతరింపజేశాడు. అందువల్ల ఖాలిద్ బిన్ వలీద్ కుయుక్తి బూడిదలో పోసిన పన్నీరయ్యింది.

సంధి సంప్రదింపులకుగాను హజ్రత్ ఉస్మాన్ (ర)ను దైవ ప్రవక్త (ﷺ) ఖురైషుల వద్దకు పంపారు. ముస్లింలు కేవలం ఉమ్రా చేసే ఉద్దేశ్యంతో వచ్చారని, పోరాటం వారి ఉద్దేశ్యం కానేకాదని వారికి తెలియజేయాలి. ఆపై ఖురైషుల ప్రతిస్పందన ఎలా ఉంటుందో తెలుసుకోవాలన్నది ప్రవక్త (ﷺ) అభిలాష. ఎట్టకేలకు హజ్రత్ ఉస్మాన్ (ర) తనతోపాటు సంధి సంప్రదింపులకు ఖురైషుల రాయబారిని కూడా దైవ ప్రవక్త (ﷺ) సన్నిధికి తీసుకొచ్చారు.

## సంధి షరతులు

1) ఈ సంవత్సరం ముస్లింలు ఉమ్రా చేయకుండా వెనక్కి మరలిపోవాలి.
2) వచ్చే ఏడాది ఉమ్రా కోసం రావచ్చు. అయితే మూడు రోజులు మాత్రమే మక్కాలో ఉండాలి.
3) ఉభయ పక్షాల మధ్య పదేళ్ళ వరకు యుద్ధం జరగరాదు. ఒకరికి వ్యతిరేకంగా మరొకరు ఎలాంటి కవ్వింపు చర్యలకూ పాల్పడకూడదు. ఈ మధ్య కాలంలో ప్రజలంతా ప్రశాంతంగా ఉండాలి.
4) ఈలోగా మక్కాకు చెందిన ఏ వ్యక్తి అయినా అతని యజమాని అనుమతి లేకుండా ముహమ్మద్ (ﷺ) దగ్గరకు పారిపోయి వస్తే అతన్ని వారి దగ్గరికి తిప్పి పంపాలి. అదే ముహమ్మద్ (ﷺ) దగ్గర నుండి ఎవరైనా పారిపోయి ఖురైషుల వద్దకు వస్తే వారు అతన్ని ప్రవక్త (ﷺ) వద్దకు తిరిగి పంపనవసరం లేదు.

పైకి ఈ సంధి ముస్లింలకు ప్రతికూలంగాను, ఖురైషీయులకు అనుకూలంగాను కన్పిస్తుంది. అయితే వాస్తవ దృక్పథంతో గనక చూసినట్లయితే ఈ ఒప్పందం నూటికి నూరుపాళ్లు ముస్లింలకు అనుకూలంగా ఉందని ఇట్టే అర్థం అవుతుంది. ఎందుకంటే ఇప్పుడు ముస్లింలు కూడా ఓ గొప్ప శక్తి అని అవిశ్వాసులు పరోక్షంగా ఒప్పుకున్నారు. అలాగే ఈ ఒప్పందం వల్ల ఇతర అనేక తెగలను ఇస్లాం వైపు ఆహ్వానించడానికి గొప్ప అవకాశం లభించింది.

# నిర్యుద్ధ సంధి ఫలితాలు
## (చక్రవర్తులకులేఖ సందేశం)

**హుదైబియా** ఒడంబడిక ఫలితంగా మదీనాలో ముస్లింలకు కొంత కాలం ప్రశాంతంగా ఊపిరి పీల్చుకునే అవకాశం దక్కింది. దైవ సందేశాన్ని దైవ దాసులకు చేరవేయడానికి ఇది సువర్ణావకాశం. అందుకే హిజ్రీ శకం 6వ సంవత్సరం చివర్లో దైవ ప్రవక్త (ﷺ) ఆనాటి గొప్ప గొప్ప చక్రవర్తులకు ఇస్లాం వైపు ఆహ్వానిస్తూ సందేశ లేఖలు వ్రాశారు (వ్రాయించారు). ఈ లేఖలు రాయించాలని సంకల్పించుకున్నప్పుడు చక్రవర్తులు ముద్ర లేకుండా అంగీకరించరని చెప్పబడింది. అప్పుడు మహా ప్రవక్త (ﷺ) ఆ లేఖల మీద ముద్ర కోసమని ప్రత్యేకంగా ఒక వెండి ఉంగరాన్ని చేయించారు. దాని మీద **"ముహమ్మదుర్రసూలుల్లాహ్"** అనే అక్షరాలుండేవి. ఆ తర్వాత హబ్షా చక్రవర్తి నజాషీని ఇస్లాం వైపు ఆహ్వానిస్తూ లేఖ వ్రాసి పంపారు. నజాషీ ప్రవక్త (ﷺ) గారి ఆహ్వానాన్ని స్వీకరించి తన ఇస్లాంను బాహాటంగా ప్రకటించాడు. అలాగే ప్రవక్త (ﷺ) ఈజిప్ట్ పాలకుడు "ముఖౌఖిస్" పేర కూడా ఒక లేఖ పంపారు. ముఖౌఖిస్ ఇస్లాం స్వీకరించ లేదు. కానీ దైవ ప్రవక్త (ﷺ) కోసం విలువైన కానుకలు ఇచ్చి పంపాడు. ఇంకా అతను 'మారియా ఖిబ్తియా' అనే సేవకురాలిని కూడా దైవ ప్రవక్త (ﷺ) వారికి బహూకరించాడు. ఈమెను తర్వాత ప్రవక్త (ﷺ) వివాహమాడారు. ఆమె ద్వారానే ఆయన (ﷺ)కు 'ఇబ్రాహీమ్' అనే కుమారుడు జన్మించాడు.

అదే విధంగా ఈరాన్ రాజు కి(స్రా పేర కూడా అతన్ని ఇస్లాం వైపు ఆహ్వానిస్తూ లేఖ వ్రాశారు. అతను పొగరుతో ఆ లేఖను చించి పారేశాడు. ఈ సంగతి తెలుసుకున్న ప్రవక్త (ﷺ) అల్లాహ్ అతని సామ్రాజ్యాన్ని ఈ ఉత్తరంలాగే తునాతునకలు చేసి, అతడికి స్థానభ్రంశం చేయుగాక ! అని శపించారు. ఇలా శపించిన కొన్నాళ్ళకే ప్రవక్త (ﷺ) దుఆ నిజమైంది. కిస్రా సొంత కుమారుడైన 'షేర్‌వైహ్' తండ్రిపై తిరుగుబాటు చేసి, అతడ్ని హతమార్చి సింహాసనాన్ని తన కైవసం చేసుకున్నాడు.

రోము చక్రవర్తి 'ఖైసర్' పేర కూడా ఒక లేఖ పంపారు. అప్పుడు అతను ప్రవక్త (ﷺ) గురించి వివరాలు తెలుసుకోవడానికి అరబ్బు వర్తకుల గురించి ఆరా తీశాడు. యాదృచ్ఛికంగా ఆ రోజుల్లో ఖురైషు నాయకుడు అబూ సుఫ్యాన్ వ్యాపార నిమిత్తం సిరియా దేశానికి వచ్చి ఉన్నాడు. ఖైసర్ దర్బారులో హాజరై అబూ సుఫ్యాన్ ప్రవక్త (ﷺ) గారి విశిష్ట గుణ సంపద గురించి వర్ణించడంతోపాటు, ఇస్లాం ధర్మమే సత్య ధర్మమని అంగీకరించాడు. అయితే తాను మాత్రం ఇస్లాం స్వీకరించలేదు. అలాగే బహ్‌రైన్, ఒమాన్, యమన్ దేశ పాలకుల పేరున కూడా లేఖలు పంపారు. ఆ తర్వాత హిజ్రీ శకం 7వ సంవత్సరంలో దైవ ప్రవక్త (ﷺ) అబూ సుఫ్యాన్ కూతురు 'రమ్లా'ను వివాహమాడారు. ఆమె ఉమ్మె హబీబా అనే బిరుదుతో పిలువబడేది. అలాగే ఈ సంవత్సంలోనే హారిస్ కుమార్తె హజ్రత్ మైమూనా (ర) గారిని కూడా మనువాడారు మహా ప్రవక్త (ﷺ).

## మక్కా విజయం (హిజ్రి శకం- 8)

హుదైబియాలో కుదిరిన సంధి రెండు సంవత్సరాల పాటు ముస్లింలకు – ఖురైషులకు మధ్య కొనసాగింది. అయితే కొన్నాళ్ళ తర్వాత ఖురైషులు సంధి షరతుల్లోని ఓ షరతుని ఉల్లంఘించారు. తత్కారణంగా దైవ ప్రవక్త (ﷺ) హిజ్రీ శకం 8వ సంవత్సరంలో పది వేల మంది అనుచరులతో మదీనా నుండి బయలుదేరారు. మక్కా బైట ఇంత పెద్ద సైన్యాన్ని చూసిన ఖురెషులు కొయ్యబారి పోయారు. సైనికులంతా రాత్రి సమయంలో అగ్ని మంటలు రాజేయవలసిందిగా ప్రవక్త (ﷺ) ఆదేశించారు. ఖురైషులు మళ్ళీ సంధి కుదుర్చుకోవాలన్న ఉద్దేశంతో అబూ సుఫ్యాన్‌ను పంపించారు. దైవ ప్రవక్త (ﷺ) అతన్ని ఇస్లాం వైపు ఆహ్వానించారు. ఆయన ఇస్లాం స్వీకరించారు. మరుసటి రోజు ఉదయం ప్రవక్త (ﷺ) మక్కాలో ప్రవేశించారు. (అనివార్యమైతే తప్ప) ఒక్క రక్తపు బొట్టు కూడా చిందించకూడదని ఆయన (ﷺ) ముస్లిములకి హితవు చేశారు. ఆ తర్వాత ముస్లింలను ఉద్దేశించి మరి కొన్ని ఆదేశాలు జారీ అయ్యాయి.

1) తన ఇంటిలో ద్వారాలు మూసుకుని ఉండే వ్యక్తికి మన్నింపు ఇవ్వబడుతుంది.
2) మస్జిదె హరామ్‌లో ప్రవేశించిన వ్యక్తి సురక్షితుడు.
3) అబూ సుఫ్యాన్ నివాసంలో తల దాచుకున్న వ్యక్తి సురక్షితుడు.

ఆ తర్వాత ప్రవక్త (ﷺ) మస్జిదె హరామ్‌లో ప్రవేశించారు. “అల్లాహు అక్బర్” అని బిగ్గరగా తక్బీర్ చెప్పారు. అల్లాహ్‌ను కీర్తిస్తూ ఇలా అన్నారు: “అన్ని విధాల పొగడ్తలు ఒక్క అల్లాహ్‌కు మాత్రమే చెందు. ఆయన తానిచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు. ఆయన తన దాసునికి సహాయం చేశాడు. తానొక్కడే ఇతర ముఠాలన్నింటిని ఓడించాడు”. ఆ తర్వాత కాబా గృహ ప్రదక్షిణ చేశారు. అప్పుడు కాబా చుట్టూ 360 విగ్రహాలున్నాయి. మహా ప్రవక్త (ﷺ) తన సహచరులతో కలసి “సత్యం వచ్చేసింది, అసత్యం నిష్క్రమించింది; అసత్యం ఎప్పటికైనా నిష్క్రమించేదే” అన్న దైవ సూక్తిని పఠిస్తూ విగ్రహాలను తొలగించారు.

## గజ్వయె హునైన్
### (హునైన్ పోరాటం: హిజ్రీ శకం 8)

మక్కా విజయం తర్వాత రెండు తెగల్ని మినహాయించి మిగతా వారంతా ఇస్లాం గొప్పతనాన్ని అంగీకరించారు. ఆ రెండు తెగల్లో ఒకటి హవాజిన్, రెండవది సఖీఫ్. వారు ముస్లింలకు లొంగకపోవడమేకాక వారికి వ్యతిరేకంగా యుద్ధ సన్నాహాలు చేయసాగారు. ఈ రెండు తెగలు మక్కా – తాయిఫ్‌ల మధ్య నివసించేవి. వాళ్ళు ఓ పెద్ద సైన్యాన్ని సిద్ధపరిచారు. తమతోపాటు మేకల్ని, పశువుల్ని, స్త్రీలని కూడా వెంట బెట్టుకుని మక్కాకు బయలుదేరి, హునైన్ లోయలో మోహరించారు. వారందరి కమాండర్ వారి అశ్వ దళాన్ని, విలు కాండ్రను వేరు వేరు పరచి ఆ లోయలోని రహస్య స్థావరాల్లో మాటువేసి ఉండమని, ముస్లింలు ఈ ఇరుకైన లోయగుండా ప్రవేశించగానే వారిపై ఒక్క సారిగా బాణాల వర్షం కురిపించి, మెరుపు దాడి చెయ్యండి అని ఆదేశించాడు.

ఇటు దైవప్రవక్త (ﷺ) కూడా 12 వేల మంది ముస్లిం సిపాయిలతో మక్కా నుండి బయలుదేరారు. వారిలో పది వేల మంది పూర్వం మక్కా విజయంలో పాల్గొన్నవారే. మిగతా రెండు వేల మంది మక్కా వాసులు. వారిలోని అత్యధికులు కొత్తగా ఇస్లాం స్వీకరించినవారే. ఇక్కడ ముస్లింలు తమ సంఖ్యా బలాన్ని చూసుకుని కాస్తంత గర్వానికి లోనయ్యారు. ప్రవక్త (ﷺ) సైన్యం లోయలో ప్రవేశించిన మరుక్షణమే సైనికుల్లో కలకలం మొదలయ్యింది. పంక్తులు చిందరవందరయ్యాయి. ముందు భాగంలో జెండా పట్టుకుని ఉన్నవారు కూడా నిలద్రొక్కుకోకలేక పరుగెత్తారు. ముస్లింలు ఆ లోయలో ఎటుపడితే అటు దిక్కు తోచక పరుగెత్తసాగారు. ఇరుకైన లోయలో శత్రువులు బాణాలతో చేసే దాడికి ముస్లింలు దిగ్భ్రాంతి చెందారు.

**ఆ తర్వాత ఏం జరిగింది?**

అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాదు:

**"హునైన్ దినాన్ని కాస్త గుర్తుకు తెచ్చుకోండి. అప్పుడు మీరు మీ ఆధిక్యతపై ఎంతో గర్వపడ్డారు. కాని అది మీకు ఉపకరించలేక పోయింది. భూమి విశాలంగా ఉండి కూడా మీ కోసం కుంచించుకుపోయిందా అనిపించింది. మీరు వెన్ను చూపి పలాయనమవసాగారు. అయితే అల్లాహ్ తన సందేశ హరునిపై, విశ్వాసులపై తన తరపున మనోనిబ్బరాన్ని, ప్రశాంతతను అవతరింపజేశాడు. మరో వైపు మీకు కన్పించని (దైవ దూతల) సైన్యాన్ని కూడా దించి సత్య తిరస్కారుల్ని శిక్షించాడు. సత్యాన్ని తిరస్కరించేవారికి తగిన శాస్తి ఇదే".** (తౌబా: 25,26)

ఆ తర్వాత దైవ ప్రవక్త (ﷺ) ముస్లింలను బిగ్గరగా పిలుస్తూ ఇలా అన్నారు: "ఓ ప్రజలారా! నా వద్దకు రండి. నేను దైవ సందేశహరుణ్ణి, నేను అబ్దులాహ్ కుమారుడు ముహమ్మద్‌ని, నా వైపునకు రండి". ప్రవక్త (ﷺ) గారి చుట్టూ ముహాజిర్లు, ఆయనగారి కుటుంబ సభ్యుల్లో కొందరు తప్ప ఎవ్వరూ నిలువలేకపోయారు. ఆ తర్వాత ప్రవక్త (ﷺ) అల్లాహ్‌ను వేడుకున్నారు. మళ్ళీ తన అనుచరుల్ని పిలుపునిచ్చారు. ఒక్కొక్కరు చొప్పున అందరూ ప్రవక్త (ﷺ) వద్దకు చేరుకున్నారు. ముస్లింలు ఇప్పుడు స్థిరంగా నిలబడి ధైర్యంగా శత్రువుల్ని చీల్చి చెండాడటం మొదలెట్టారు. ప్రవక్త (ﷺ) ఓ పిడికెడు మన్ను తీసుకుని 'శత్రువుల ముఖాలు మారిపోవుగాక!' అని వారి వైపు విసిరేసారు. కాసేపటికే శత్రు సైన్యం ఘోర పరాజయం చవిచూసింది. ఆయుధాలు, ధనం, గొర్రెలు – ఇలా విజయ ప్రాప్తి ముస్లింల సొంతం అయింది. ప్రవక్త (ﷺ) ఈ విజయప్రాప్తిని పంచడానికి పూనుకున్నారు.

ఈ విజయప్రాప్తిలోని అధిక భాగాన్ని మక్కా తెగ నాయకులు, ప్రముఖుల కోసం కేటాయించారు. అలా మంచిని ఉద్దేశించే చేశారు. కొత్తగా ఇస్లాం స్వీకరించి వీరు ధర్మంపై నిలకడ కలిగి ఉండాలని కాస్త ఉదారంగా వ్యవహరించి వారికి కొంచెం ఎక్కువే ఇచ్చారు. ఇందులో అన్సార్లకు ఏమీ దక్కలేదు. విజయప్రాప్తి పంచడంలో దైవప్రవక్త (ﷺ) తమ జాతివారికే ప్రాధాన్యత ఇచ్చారని అన్సారులు బాధపడ్డారు. అది తెలుసుకున్న దైవప్రవక్త (ﷺ) వారందరిని సమావేశపరచి ఇలా చెప్పారు: "విజయప్రాప్తి విషయంలో మీరు నా గురించి గుసగుసలాడుతున్నారని విన్నాను. (ఒకసారి మీ గతం గురించి ఆలోచించండి) నేను మీ దగ్గరికి రాక ముందు మీరు మార్గ విహీనులుగా ఉండేవారు. నా ద్వారా అల్లాహ్ మీకు సన్మార్గం చూపించాడు. మీరు నిరుపేదలుగా ఉన్నప్పుడు అల్లాహ్ నా ద్వారా మీకు సిరిసంపదలు ప్రసాదించాడు. మీరు అంతః కలహాలలో మునిగి ఉన్నప్పుడు నా ద్వారా అల్లాహ్ మీలో ప్రేమాభిమానాలు కలిగించాడు (ఇవన్నీ వాస్తవాలు కావా?)" అంటూ అడిగారు (వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ). 'వాస్తవమే దైవప్రవక్తా! అల్లాహ్

మరియు ప్రవక్త మాకెంతో మేలు చేశారు. వారి దయాదాక్షిణ్యాలు మాపై అనేకం ఉన్నాయి. మాకు ఈ విజయప్రాప్తి కన్నా అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తే మిన్న' అంటూ అన్సార్లంతా ఏకధాటిగా కన్నీరు కార్చారు. తరువాత ఇలా అన్నారు: 'మేమంతా ప్రవక్త (ﷺ) గారి పట్ల అన్ని విధాలా ప్రసన్నులయ్యాము'.

## గజ్వయె తబూక్

### (తబూక్ యుద్ధం హిజ్రీ శకం -9)

మక్కా విజయం సత్యానికి, అసత్యానికి మధ్య గీటురాయిలా పని చేసింది. ఈ విజయానంతరం ప్రవక్త (ﷺ) గారి సందేశం పట్ల ఏ విధమైనటువంటి అపోహ, అపార్థం, అనుమానం అరబ్బుల వద్ద మిగులలేదు. ప్రజలు దైవ ధర్మంలో తండోప తండాలుగా ప్రవేశించసాగారు. అయితే అనవ సరంగా ముస్లింలతో కయ్యానికి కాలు దువ్వే ఓ శక్తి ఉద్భవించింది. అదే రోమనుల సైన్యం. ఆ కాలం నాటి గొప్ప సైన్యం గల సామ్రాజ్యం రోము. రోము చక్రవర్తి ఖైసర్ తన సైనికులు మరియు తనకు అనుకూలంగా ఉన్న అరబ్బు సిపాయిల సైన్యాలతో ముస్లింలపై దాడి చేసి వారిని అంతమొందించాలని పథకం వేశాడు. రోముల ఈ సైనిక చర్యల గురించి ముస్లింలకు తెలిసింది. ముస్లింలలో ఓ విధమైనటు వంటి భయాందోళనలు చోటు చేసుకున్నాయి. ఇది గ్రహించిన దైవ ప్రవక్త (ﷺ) దూర దృష్టిని ఉపయో గించి, మీన మేషాలు లెక్కిస్తూ కూర్చోక తక్షణమే యుద్ధం కోసం సమాయత్తమవ్వండని ఆదేశించారు. అలాగే రోమన్లతో పోరాటానికి సిద్ధ మవ్వండని ఇతర అరబ్బు తెగలను సయితం ప్రోత్సహించారు. అల్లాహ్ మార్గంలో, ధన, కనక వస్తు త్యాగాల కోసం ప్రజల ను ప్రేరేపించారు. దైవ ప్రవక్త (ﷺ) వారి బోధనతో ఉత్తేజితులైన ప్రజలు భారీ విరాళాలు అందజేయడం ప్రారంభించారు. సైన్యం 30వేలకు చేరుకున్నాక, ఆ ముస్లింల సైన్యాన్ని తీసుకుని యర్మూక్ వైపు బయలుదేరారు. అక్కడ చేరుకుని మకాం వేశారు. ఆ తర్వాత అందరిని ఉద్దేశించి హితోపదేశం చేశారు. ఇహలోకంలో పరలోకంలో మంచిని కాంక్షించమని, చెడుల నుండి దూరంగా మసలుకొండని తాకీదు చేశారు.

అటు రోమన్లు ప్రవక్త (ﷺ) రాక గురించి తెలుసుకుని భయపడిపోయారు. వారు ముస్లిం యోధులను ఎదుర్కొనడానికి సాహసించలేకపోయారు. వారు తమ హద్దుల్లో గల కోటల్లోనే ఉండిపోయారు. ముస్లింలు ఓ గొప్ప శక్తిగా రూపొందారన్న దానికి ఇది ప్రబల తార్కాణం. ఈ విషయాన్ని రోమ్ చుట్టుప్రక్కల దేశాలు కూడా గ్రహించాయి. అలా యుద్ధం సంభవించి ఉంటే లభించని అనేక రాజకీయ లాభాలు యుద్ధం జరగకుండానే ప్రాప్తమయ్యాయి. ముస్లిం యోధులు విజయకేతనం ఎగురవేస్తూ వీరుల్లా శూరుల్లా మదీనాకు క్షేమంగా చేరుకున్నారు.

## హజ్రత్ అబూ బకర్ (رضي الله عنه) గారి హజ్ ప్రయాణం (హిజ్రీ శకం - 9)

మహా ప్రవక్త ముహమ్మద్ (ﷺ), హజ్రత్ అబూ బకర్ (ర) గారిని ప్రతినిధిగా చేసి యాత్రికులతో హజ్ చేయడానికి పంపారు. మక్కా చేరుకున్న తర్వాత హజ్రత్ అబూ బకర్ (ర) కొందరు మనుషుల్ని పంపి ప్రజలకు ఈ విషయాలు తెలియ జేయండని పురమాయించారు. “ఈ సంవత్సరం తర్వాత బహు దైవారాధకులు పవిత్రాలయ పరిధుల్లో ప్రవేశించి హజ్ నియమాలు పాటించడానికి వీల్లేదు. ఏ ఒక్కరూ నగ్నంగా కాబా ప్రదక్షిణ చేయకూడదు” అని వారందరూ ప్రజల సమక్షంలో బాహాటంగానే ప్రకటించారు. ఈ ప్రకటన – ఇక అరేబియాలో విగ్రహా రాధనకు నూకలు చెల్లిపోయాయి అన్న దానికి నాందిగా నిలిచింది. ప్రభంజన వేగం తో ఇస్లాం ప్రసరించడంలో హిజ్రీ శకం 9, 10వ సంవత్సరం ఓ ప్రత్యేకతను సంతరించుకుంది. ఈ రెండేళ్లలో అతి పెద్ద ఎత్తున జనులు మదీనా వచ్చి ఇస్లాం స్వీకరించి, ఇస్లామీయ శిక్షణ గరిపి ఆ తర్వాత తమ తమ తెగల వారి వద్దకు ధర్మబోధకులుగా తిరిగి వెళ్ళేవారు.

# చివరి హజ్ ప్రయాణం

**(హజ్జతుల్ విదా హి.శ. 10)**

**"ప్రజలారా! నా తరువాత మరో ప్రవక్త రాబోడు. మీ తరువాత మరో సము దాయం (ప్రవక్త (ﷺ) ఉమ్మత్) రాబోదు. బాగా వినండి. మీ నిజ ప్రభువునే ఆరాధించండి. ఐదు పూటల నమాజు పాటించండి. రమజాను మాసపు ఉపవాసాలు ఉండండి. మీ సంపద లోంచి జకాతు చెల్లిం చండి. మీ ప్రభువు గృహం వైపు హజ్ (ప్రయాణం) చేయండి. మీ నాయకుల మాట వినండి. (ఇలా గనక మీరు చేస్తే) మీరు స్వర్గంలో ప్రవేశిస్తారు".**

ధర్మ సందేశాన్ని ప్రజలకు చేరవేసే కార్యం పూర్తి అయిన తర్వాత, మిథ్యాశక్తుల్ని ప్రక్కనెట్టి స్వచ్ఛమైన ఏకేశ్వరోపాసనా సిద్ధాంతంపై మరియు ప్రవక్త (ﷺ) గారి దైవ దౌత్యంపై నూతన సమాజ సంస్థాపన జరి గిన పిదప తన ఇహలోక గడువు పూర్తి కావస్తుందన్న అనుమానం ప్రవక్త (ﷺ) గారి మదిలో మెదిలింది. హిజ్రి శకం 10వ ఏట మహా ప్రవక్త (ﷺ) హజ్ కొరకు ప్రయాణం కానున్నారని ప్రకటించారు. మదీనా నుండి (మరియు ఇతర ప్రాంతాల నుండి) అనేక మంది బయలుదేరారు. వారిలోని ప్రతి ఒక్కరికి ప్రవక్త (ﷺ) గారితో హజ్ చేయాలన్న ఆకాంక్ష ఉంది. వారి సంఖ్య దాదాపు లక్షకు చేరుకుంది. ఈ గొప్ప జన సమూహం మక్కా వైపు ప్రయాణమయ్యింది. ప్రవక్త (ﷺ) మస్జిదె హరామ్‌లో ప్రవేశించటంతోనే 'కాబా' ప్రదక్షిణ చేశారు. సఫా-మర్వా కొండల మధ్య (జోరుగా నడిచి) సయీ చేసారు. ఆ తర్వాత ఎని మిదవ తారీఖున - అదే 'యౌముత్తర్వియా' (తర్వియా రోజు)న మినాకి వెళ్ళారు. ఆ తర్వాత 9వ తేదీన మినా నుండి అరఫా మైదానానికి చేరుకున్నారు. అక్కడ ఆయన (ﷺ) తన చరిత్రాత్మకమైన ప్రసంగాన్ని విన్పించారు. ఈ ప్రసంగాన్నే 'వీడ్కోలు ప్రసంగం' అంటారు. ఈ ప్రసంగంలో ఆయన ఇలా ఉపదేశిం చారు.

"ప్రజలారా! (నేను చెప్పేదంతా) శ్రద్ధగా ఆలకించండి. వచ్చే యేడు నేనిక్కడ మిమ్మల్ని కలుసుకుంటానో లేదో తెలియదు. మీ రక్తం (ప్రాణం) మీ ధనం ఒకరింకొ కరికి పవిత్రం (అంటే నిషిద్ధం). ఈ రోజు, ఈ నెల, ఈ నగరం పవిత్రమైనట్టు! అజ్ఞానకాలపు ఆచారాలన్నీ నా పాదాల క్రిందున్నాయి (అంతమయి పోయాయి). అజ్ఞాన కాలపు మీ రక్త పరిహారాలన్నీ నేటితో అంతం (నిషిద్ధం) చేయబడ్డాయి.

నిశ్చయంగా వడ్డి నిషేధించబడింది. మహిళల విషయంలో మీరు అల్లాహ్‌కు భయపడండి. వారితో మంచిగా వ్యవహరించండి. వారికి మంచిగా అన్న వస్త్రాలు ఇవ్వండి. నేను మీ మధ్య ఒక వస్తువును వదలి వెళుతున్నాను. దాన్ని మీరు దృఢంగా పట్టుకుని అనుసరించారంటే ఎన్నటికీ మీరు దారి తప్పరు. అదే దైవగ్రంథం ఖుర్‌ఆన్.

"ప్రజలారా! నా తరువాత మరో ప్రవక్త రాబోడు. మీ తరువాత మరో సముదాయం (ప్రవక్త (ﷺ) ఉమ్మత్) రాబోదు. బాగా వినండి. మీ నిజ ప్రభువునే ఆరాధించండి. ఐదు పూటల నమాజు పాటించండి. రమజాను మాసపు ఉపవాసాలు ఉండండి. మీ సంపదలోంచి జకాతు చెల్లించండి. మీ ప్రభువు గృహం వైపు హజ్ (ప్రయాణం) చేయండి. మీ నాయకుల మాట వినండి. (ఇలా గనక మీరు చేస్తే) మీరు స్వర్గంలో ప్రవేశిస్తారు".

ఇలా మహా ప్రవక్త (ﷺ) ప్రతి వాక్యం తరువాత కాసేపు మౌనం వహించేవారు. ప్రవక్త (ﷺ) చెప్పిన పలుకుల్ని బిగ్గరగా పునరుద్ఘాటించి ప్రజలకు వినిపించాలని, అలాగే అక్కడున్న ప్రతి వ్యక్తికి ఈ పిలుపు అందాలని ఇలా చేశారు. తన ప్రసంగాన్ని పూర్తి చేసిన మీదట చివర్లో ఆయన – (ప్రజలారా!) "నేను దైవ సందేశాన్ని మీకు అందజేశానా?" అని పలికినప్పుడు 'మీరు దేవుని సందేశాన్ని అందజేశారు. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తించారు, మాకు గొప్ప గొప్ప ఆదేశాలు చేశారని మేము సాక్ష్యమిస్తున్నాము' అని జవాబు చెప్పారు సహాబా. ఇది విని దైవ ప్రవక్త (ﷺ) "ఓ అల్లాహ్! దీనికి నీవే సాక్షివి" అని అన్నారు.
దైవప్రవక్త (ﷺ) ప్రసంగం ముగిశాక, ఆ సందర్భంలోనే విశ్వ ప్రభువు కారుణ్య జల్లు కురిసింది –
**"నేనీ రోజు మీ కోసం మీ ధర్మాన్ని (సమగ్ర జీవన వ్యవస్థగా) పరిపూర్ణం చేశాను. నా అనుగ్రహాలను కూడా ఇక దీనితో పూర్తి చేశాను. ఇంకా మీ శ్రేయస్సు కోసం ఇస్లాంను మీ జీవన ధర్మంగా ఆమోదించాను".** (మాయిదా:3)

# పరమోన్నత మిత్రుని వైపునకు

**"మైత్రి విషయంలో నైతేనేమీ, ధనం విషయంలోనైతేనేమీ, అబూ బక్ర్ (రజి) ప్రజలందరి కన్నా నా దృష్టిలో గొప్ప త్యాగధనుడు. అల్లాహ్‌ను వదలి మరెవరినైనా మిత్రుడ్ని చేసుకునే వీలుండి ఉంటే నేను అబూ బక్ర్ (రజి)ను మిత్రుడ్ని చేసుకునేవాడ్ని. అయితే ఇస్లాం మూలంగా మనం పరస్పరం సహోదరులం, బంధువులం".**

**హజ్** యాత్ర నుండి తిరిగి వచ్చిన రెండు నెలల లోపే మహా ప్రవక్త (స) గారికి జబ్బు చేసింది. తీవ్ర మయిన తల నొప్పితో ముఖమంతా ఎర్రబడింది. అనారోగ్యానికి గురైన అయిదవ రోజు ప్రవక్త (స) ఉహద్ కొండ వైపు వెళ్ళారు. అక్కడ చేరుకుని ఉహద్ యుద్ధంలో అమరగతులైన వారి కోసం దుఆ చేశారు. ఆ తర్వాత మస్జిదె నబవీ చేరుకుని ప్రజలనుద్దేశించి ఇలా ప్రసంగించారు: "బాగా వినండి! మీరు నా సమాధిని ఆరాధనా స్థలంగా మార్చుకోకండి. అన్సార్లతో మంచిగా వ్యవహరించండి".

మరణానికి నాలుగు రోజుల ముందు జ్వరం తీవ్రమవ్వ సాగింది. శరీరమంతా కాలిపోతుంది. సహచరులు ఆయన తలపై నీళ్ళు పోశారు. ప్రవక్త (స) మస్జిద్‌కి బయలుదేరారు. సరిగ్గా అదే సమ యంలో హ్రజత్ అబూ బకర్ (ర) నమాజు చేయించ డానికి ఇమామ్ స్థానం వద్దకెళ్ళి నిల్చున్నారు. దైవప్రవక్త (స) వస్తున్నట్లు అలికిడి వినగానే ఆయన అక్కడ్నుంచి తప్పుకోబోయారు. కానీ ప్రవక్త (స) నమాజు పూర్తి చెయ్యమని ఆజ్ఞాపించారు. నమాజు తర్వాత శ్రోతలను ఉద్దేశించి ప్రసంగం చేశారు: "అల్లాహ్ తన దాసుడ్ని ఈ ప్రపంచంలోనైనా ఉండ వచ్చని, లేదా అల్లాహ్ అనుగ్రహ ఛాయలోకి అయినా రావచ్చని స్వేచ్ఛ ఇచ్చాడు. అప్పుడా దాసుడు దేవుని అనుగ్రహ ఛాయలోకి వెళ్ళే విషయానికే ప్రాధాన్యం ఇచ్చాడు" అన్నారు. ఈ మాట వినగానే హ్రజత్ అబూ బకర్ (ర) దుఃఖం ఆపుకోలేక బోరున ఏడ్చారు. "మీ కోసం మా తల్లిదండ్రుల్ని, తాత ముత్తాతలందర్ని త్యాగం చేస్తాము" అన్నారు. ఎందుకంటే దైవప్రవక్త (స) త్వరలోనే ఇహ లోకం వీడనున్నారని ఆయన పసిగట్టారు. ఆ తర్వాత ప్రవక్త (స) ఇంకా ఇలా అభిప్రాయపడ్డారు:

"మైత్రి విషయంలో నైతేనేమీ, ధనం విషయంలోనైతేనేమీ, అబూ బక్ర్ (ర) ప్రజలందరికన్నా నా దృష్టిలో గొప్ప త్యాగధనుడు. అల్లాహ్‌ను వదలి మరెవరినైనా మిత్రుడ్ని చేసుకునే వీలుండి ఉంటే నేను అబూ బక్ర్ (రజి)ను మిత్రుడ్ని చేసుకునేవాడ్ని. అయితే ఇస్లాం మూలంగా మనం పరస్పరం సహోదరులం, బంధు వులం". మరణానికి ముందు ప్రవక్త (ﷺ) తన బానిసలకు స్వేచ్ఛనిచ్చారు. తమ దగ్గర ఉన్న ఏడు దీనార్లు (తాను చనిపోతే ఈ ప్రజా ధనం తన దగ్గరే ఉండిపోతుం దని భయపడి) తక్షణమే నిరుపేదలకు దానం చేసేశారు. తన ఆయుధాల్ని సైతం ముస్లింలకు పంచి పెట్టారు. (ఆ రాత్రి హాయిగా గడిచి పోయింది).

మరుసటి రోజు సోమవారం తెల్లవారు ఝామున అనుచరులంతా ఫజ్ర్ నమాజ్‌లో లీనమై ఉండగా, హజ్రత్ ఆయిషా (ర) గారి గదిలో నుంచి కిటికి తెర పైకెత్తి సహచరుల్ని చూశారు. (చివరికి తాను ఆశించిన సమాజం పుడమిపై ఆవిర్భ వించిందని తలచి) ఆయన తృప్తిగా నిట్టూర్పు వదిలారు. ఆయన హృదయం ఆనందంతో పరవశించిపోయింది. ఆయన పెదాలపై చిరునవ్వు తొణికిసలాడింది. ముస్లింలను నమాజు పూర్తి చేయమని చేతితో సైగ చేసి కిటికి తెర దించి వేశారు. సూర్యుడు కాస్త పైకి ఎగబ్రాకాక తన ముద్దుల కూతురు ఫాతిమా (ర) గారిని దగ్గరకు పిలిచారు. ఆమె దగ్గరకు వెళ్ళగా, ఆమె చెవిలో ఏదో చెప్పారు. అది విని ఆమె బోరున విలపించారు. దైవప్రవక్త (ﷺ) కూతురి చెవిలో మళ్ళీ ఏదో చెప్పారు. ఆ మాట విని ఆమె చిరు నవ్వు నవ్వారు. హజ్రత్ ఆయిషా (ర) గారు ఇలా అన్నారు: మేమందరం ఆ విషయం గురించి ఆరా తీశాము. అందుకామె దైవప్రవక్త (ﷺ) నాతో మొదట 'నేనిక ఎంతో కాలం బ్రతకను. నన్ను ప్రభాత వేళ (ఆరిపోయే) దీపంగా భావించమ్మా!' అన్నారు. అది విని నేను ఏడ్చాను. ఆ తర్వాత వెనువెంటనే 'నేను వెళ్ళాక నా దగ్గరకి అందరికంటే ముందు నువ్వే వస్తావమ్మా!' అన్నారు ప్రవక్త (ﷺ). అప్పుడు నేను నవ్వాను. ఆ సందర్భంలోనే ప్రవక్త (ﷺ) హజ్రత్ ఫాతిమా (రజి) గారికి "నువ్వు విశ్వంలోని స్త్రీలందరికి నాయకురాలివి" అని శుభాకాంక్షలు తెలియ జేశారు. ఆ తర్వాత; హసన్, హుసైన్‌లను దగ్గరకు తీసుకుని ముద్దాడారు. వారిని బాగా చూసుకోమని బోధించారు.

## “ఆ మహా మిత్రుడే కావాలి...”

ఆ పిదప సతీమణులందరిని పిలిచి వారికి చెప్పవలసిన విషయాలు చెప్పి, హితోపదేశం కూడా చేశారు. ఆ తర్వాత ప్రజలందరిని ఉద్దేశించి ఇలా అన్నారు: **‘నమాజ్, నమాజ్, బానిసలతో మంచిగా వ్యవహరించండి’.** ఆ తర్వాత శరీరమంతా డీలా పడిపోయింది. హజ్రత్ ఆయిషా (ర) ఆయన్ను తన ఒడిలో పడుకోబెట్టారు. అప్పుడు ఆయన (ﷺ) **‘లా ఇలాహ ఇల్లల్లాహ్’** (అల్లాహ్ తప్ప ఆరాధ్య దైవం మరెవ్వడూ లేడు) అంటూనే ఉన్నారు. ఆ తర్వాత మిస్వాక్ తెప్పించి మిస్వాక్ చేశారు. ఆ సందర్భంలో ప్రవక్త (ﷺ) తరచూ ఇలా అనేవారు: **‘ఆ మహా మిత్రుడు తప్ప ఇప్పుడిక ఎవరూ అక్కర లేదు’.**

ఇలా మూడు సార్లు పలికారు. ఇలా పలుకుతూ ఉండగానే పరిస్థితి విషమించింది. ఆయన పవిత్ర ఆత్మ ఆ పరమోన్నత మిత్రుని వద్దకు చేరుకుంది. యావత్తు మదీనా శోక సముద్రంలో మునిగిపోయింది. **ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.** (మీరు మరణించారు. అందరూ మరణించ వలసినవారే. మేమూ అల్లాహ్‌కు చెందిన వారమే. అందరూ మరలి పోవలసింది ఆయన వైపుకే)

రెండవ రోజు అబ్బాస్ బిన్ అబీ తాలిబ్ (ర), హజ్రత్ అలీ ఇబ్ను అబీ తాలిబ్, అబ్బాస్ గారి ఇద్దరు పుత్రులు ఖసమ్ మరియు ఫజ్లీ, హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజియల్లాహు అన్హుం) కలసి దైవప్రవక్త (ﷺ) గారి భౌతిక కాయానికి స్నానం చేయించారు. మూడు వస్త్రాల్లో కఫన్ తొడిగించారు. ఆ తర్వాత దైవప్రవక్త (ﷺ) గారి విశ్రాంతి నిలయాన్ని ఎక్కడ స్థాపించాలన్న ప్రశ్న ఉదయించింది. హజ్రత్ అబూ బక్ర్ (ర) జోక్యం చేసుకుని “ప్రతి దైవప్రవక్త విశ్రాంతి నిలయం ఆయన ఆత్మ తనువును వీడిన చోటే అవుతుందని స్వయంగా మన ప్రియ ప్రవక్తే చెబుతూ ఉండగా నేను విన్నాను” అన్నారు. ఆ తర్వాత హజ్రత్ అబూ తల్హా (ర) ప్రవక్త (ﷺ) గారు ఉన్న పడకను తొలిగించి ఆ స్థలంలోనే సమాధి తవ్వారు. ఆ తర్వాత ఆయన్ను ఖననం చేశారు. ప్రజలందరూ పది పది మంది చొప్పున గదిలో ప్రవేశించి జనాజా నమాజు చేశారు. ముందు ప్రవక్త (ﷺ) వారి ఇంటివారు నమాజు చేశారు. ఆ తర్వాత ముహాజిర్లు, ఆ పిదప అన్సార్లు, ఆ తర్వాత స్త్రీలు, పిల్లలు అందరూ ఎవరికి వారే జనాజా నమాజ్ చేశారు.

అలా అంతిమ దైవప్రవక్త (ﷺ) అందరికి దర్శన భాగ్యం కలిగించి అశాశ్వతమైన ఈ ప్రపంచం నుండి శాశ్వతంగా తెర మరుగయ్యారు. ఆయనపై ఎల్లెడలా అల్లాహ్ శాంతి శ్రేయాలు వర్షించుగాక! ఆమీన్. **(సమాప్తం)**

